ప్రతి తల్లికీ తెలుసు:
పాప ఆహారంలో పప్పు
అవసరం

# పప్పు సుగుణాలున్న ఒకే ఒక ఆహారం ఫారెక్స్-వెజ్.



పెసర పప్పుతో బాటు
చిరుధాన్యాలూ, టొమాటాలు,
కేరట్లూ ఉన్న ఫారెక్స్ - వెజ్
రుచికరమైనది, ప్రోటీన్లు
పుష్కలంగా కల్గినది.
సులభంగా జీర్ణమ
వుతుంది.




పప్పుతో

## ఫారెక్స్-వెజ్

పెరుగుదలకు రుచికరమైన విధానం

Gx.223.90 Tel R






# మతిలేని వాసోవిచ్

మొదటేమో నర్కస్ మొనగాడు. జోకరే మొనగాడని తెలిసిపోయిందిగదా. మీరందరూ సరిగ్గా కనిపెట్టేశారు. భలే భలే! ఇప్పుడు బాల గూఢ చారులు మళ్ళీ BSA SLR సైకిళ్ళ మీద బయలు దేరారు. ఎందుకో తెలుసా? మతిలేని వాసోవిచ్ రహస్యం తెలుసుకోడానికి. వాసోవిచ్ మాములు మనిషా? వాసోవిచ్ నిమిషాలలో పేల్చేయ న్యూసిటీని దానికి అతని దగ్గర ఒక చిన్న UFO ఉంది. పెద్ద పెద్ద సైంటిస్టులే ఈ మాట చెప్పారు. బాల గూఢచారులు ఆ మాయదారి ఆట కట్టించగలరా?

"బేబీ, రేపు ఉదయం 5 గంటలకి మనమిద్దరమూ కలసి న్యూ సిటీ పేల్చేస్తున్నాము. మరచిపోయావా" గోడ చాటున దాక్కున్న బాల గూఢచారులు విన్నారు ఈమాటలు. ఎవరబ్బా అన్నది? వాసావిచ్ కాక మరెవరు? అప్పుడు తన చేతి గడియారంలో టైమ్ చూసుకున్నాడు వాసావిచ్. అటువంటి మరో గడియారంలో అదే టైమ్ పెట్టాడు. ఆ గడియారాన్ని ఆ చిన్న UFO మీద అమర్చాడు. గ్యారేజ్‌లో UFO ని ఉంచి లోపలికి వెళ్ళిపోయాడు.

## ఎత్తుకి పై ఎత్తు

అమ్మో ఎంతటి ఆందోళన ఆ ఆందోళన మరచి పోవడానికి రాల్ఫ్ ఒక జోక్ చెప్పబోయాడు. "నోరు మూసుకోరా రాల్ఫ్. జోక్‌లకి ఇది సమయం కాదు" అంది పూజ ఉన్నట్టుండి విపుల్ తన BSA SLR బెల్ మోగించాడు. చటుక్కున ఏదో ఐడియా వస్తే అలా చేయడం విపుల్‌కి





మామూలే. "అరే, మనమెందుకు..."
విపుల్ చెప్పడమే తరువాయి అందరూ ఆనందంతో తలలూపారు.

విపుల్ గోడ వెనక్కి వెళ్ళి దాక్కున్నాడు. కొంతసేపు తర్వాత బయటకు వచ్చాడు. వస్తూనే అదోలా నవ్వాడు. BSA SLR సైకిళ్ళకి స్టాండ్ వేసి టైమ్ చూసుకుంటూ ఆగారు. 4-15 అయింది. వాసావిచ్ బయటకు వచ్చి రిచ్‌మెన్ క్లిఫ్స్ వైపు బయలుదేరాడు.

క్లిఫ్ పైకి చేరుకోవాలంటే రోడ్డు ఒకటే ఎగుడు దిగుడు. ఇక ఈదురుగాలి గురించి చెప్పాలా. అయితే BSA SLRల మీద బాలా గూఢచారులు అక్కడికి శ్రమలేకుండా చేరుకున్నారు.



నిమిషాలయేనరికి ప్రయత్నం పూర్తిగా ఫలించింది. BSA SLR బెల్‌లు గణగణ మ్రోగాయి. అదే విజయం. ఏమయిందో అర్థంకాక వెర్రి చూపులు చూస్తున్న వాసావిచ్ మీద పడి పట్టుకున్నారు. విపుల్ పిడికిలి బిగించి వాసావిచ్ కళ్ళు బైర్లు కమ్మేలాగా ఒకటి ఇచ్చాడు. అంతే 'అమ్మబాబోయ్' అంటూ వాసావిచ్ అరిచాడు. న్యూసిటీని ఎలా రక్షించారో ఊహించండి?

# అంతుచిక్కని రహస్యం

ప్రయత్నం ఫలించింది.

అక్కడ అప్పటికే తన UFOని వాసావిచ్ ఉంచాడు. సరిగ్గా 5 అయ్యేసరికి తన రిమోట్ కంట్రోల్ స్విచ్ వేశాడు. అరే ఏమవలేదు. బాల గూఢచారులు పకపకా నవ్వారు. 5 గంటల 5

మతిలేని వాసావిచ్ ప్రయత్నం నెరవేరిందా, లేదా "నక్షత్రపు గుర్తు ఉన్న జోడు అంతుపట్టని రహస్యం.." చదవండి. అంత వరకూ.. BSA SLRల మీద ఆనందంగా ముందుకు సాగండి.







**BSA SLR**

*Get Set 'n' Go on an adventure*

Mudra:M:TI:4422Tel



# పాఠకులకు విజ్ఞప్తి

'చందమామ' ప్రచురణకు సంబంధించిన న్యూస్ ప్రింటు కాగితం ధర, ఈమధ్యకాలంలో విపరీతంగా పెరిగిపోయింది. అయినా, పత్రిక వెల పెంచకుండా వుండడానికి మా శాయశక్తులా ప్రయత్నించాము. కాని ఇప్పుడున్న వెలకు పత్రికను వెలువరించడం అసాధ్యంగా పరిణమించడంవల్ల, వచ్చే సంచిక నుంచి వెల పెంచడం తప్పనిసరి అయింది. జూలై '91 నుంచి చందమామ విడి ప్రతి వెల రూ. 4-00; సంవత్సర చందా 48-00 రూపాయలు.

ఈ సందర్భంలో—చక్కని కథలతో, ఆసక్తికరమైన శీర్షికలతో చందమామను మరింత ఆకర్షణీయంగా తీర్చి దిద్దగలమని పాఠకులకు మనవి చేస్తున్నాము.

పాఠకులూ, ఏజంట్లూ పరిస్థితిని సహృదయంతో అర్థం చేసుకుని, ఎప్పటిలాగే మాతో సహకరించగలరని ఆశిస్తున్నాము.

—ప్రచురణకర్తలు

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

## ప్రజాశక్తి!

**1991** వ సం॥ ప్రథమార్ధంలో భారతప్రజలు పాల్గొన్న రెండు ముఖ్యమైన సంఘటనలు జరిగాయి. పదేళ్ళ కొకసారి జరిగే జనాభా లెక్కల పరిగణన మార్చిలో పూర్తయింది. ఈ లెక్కల ద్వారా గత పదేళ్ళలో దేశ జనాభా 23.5 శాతం పెరిగినట్టు తెలిసింది. 84.39 కోట్ల జనాభాతో ఈనాడు మనదేశం ప్రపంచంలో రెండవ స్థానంలో ఉన్నది. 116 కోట్ల జనాభా గల చైనా ప్రథమస్థానం వహిస్తున్నది!

ప్రజల స్థితిగతులను, విద్యాస్థాయిని, జీవన ప్రమాణాలను తెలుసుకోవడానికి జరిపే జనాభా లెక్కల పరిగణన క్రమంగా పదేళ్ళ కొకసారి జరుగుతుంది. కాబట్టి, అదొక నిర్ణీత పథకం ప్రకారం, సరైన పద్ధతిలో సావకాశంగా జరుగుతుంది.

ఇక రెండవ సంఘటన అనుకోకుండా వచ్చిన మధ్యంతర ఎన్నికలు. నాలుగు నెలలు సాగిన చంద్రశేఖర్ ప్రభుత్వం, అనేక రాజకీయ పరిణామాల పర్యవసానంగా అస్థిరతకు లోనుకావడంవల్ల, మధ్యంతర ఎన్నికలు అనివార్యమయ్యాయి. ఈ సంచిక వెలువడే నాటికి కేంద్రంలోనూ, కొన్ని రాష్ట్రాలలోనూ కొత్త ప్రభుత్వాలు ఏర్పడగలవు. ఆ ప్రభుత్వాలు పూర్తి ఐదేళ్ళు నిలుస్తాయా లేదా అన్న విషయం ఈ ఎన్నికలలో ప్రజలు చూపే విజ్ఞతనుబట్టి వుంటుంది. దానిని నిర్ణయించే శక్తి ప్రజలకు మాత్రమే ఉన్నది!

సంపుటి 88 | జూన్ '91 | సంచిక 6
విడి ప్రతి : 3-00 : : సంవత్సర చందా : 36-00









# మేగీ క్లబ్-అడవులలో సరదా వినోదం ఉచిత బహుమతుల ఆనందం

బాలలూ రండి ! మేగీ క్లబ్‌లో చేరి, సంవత్సరమంతా సరదా వినోదాలలో పాల్గొనండి. మిమ్మల్ని ఉత్సాహ పరిచే న్యూస్ లెటర్స్ బహుమతులు, ఆటలూ ఇంకా ఎన్నెన్నో !

మీరు చేయాల్సినది ఈ [logo] ను 5 ఖాళీ మేగీ నూడుల్స్ పేక్‌ల నుండి కత్తిరించి, మీ పేరు, చిరునామా, మీకు నచ్చిన బహుమతిని పేర్కొని మాకు పంపండి. మీరు గనుక మెంబరయితే మీ నంబరును వ్రాయటం మరువకండి. మీరింకా మేగీ క్లబ్ మెంబరు కాని పక్షంలో, మెంబరు కావటానికిదే మంచి అవకాశం. మీ వివరాలతో బాటు మెంబర్‌షిప్ కావాలని వ్రాయండి. మీ బహుమతితో బాటు, మేగీ క్లబ్ మెంబర్‌షిప్ కార్డు ఉచితంగా పంపబడుతుంది.

మా అడ్రసు:

**మేగీ క్లబ్**
పి.బి. బాక్స్. 5788,
న్యూ ఢిల్లీ-110 055


మేగీ 'ఆపరేషన్ వైల్డ్ లైఫ్' ఆటలో వన్యమృగాలను రక్షించండి.



మేగీ 'కింగ్ ఆఫ్ ద జంగిల్': ఆటలో అడవులు జయించండి.


మేగీ 'జూ జంగిల్' మీరు స్వంతంగా నిర్మించండి.


మేగీ 'బర్డ్ హౌస్' ను నిర్మించండి.



ఆర్చీ కామిక్స్!




ఉచిత మేగీ 'వరల్డ్ ఆఫ్ యానిమల్స్' ప్రశ్నోత్తరావళి
మీరు 3 బహుమతులు సేకరించగానే, ఆసక్తికరమైన, ఉత్కంఠత కలిగించే అద్భుత యదార్థ విషయాలెన్నో తెలియజేసే ఉచిత మేగీ 'వరల్డ్ ఆఫ్ యానిమల్స్' ప్రశ్నోత్తరావళిని పంపుతాము. గేమ్‌లోనైనున్న వివరాలను శ్రద్ధగా చూడండి.







మరొక ఉపహారం: ఈ సరికి మీరు 'లాస్ట్ ఆఫ్ ద జంగిల్ గేమ్'ను సేకరించి ఉండక పోతే, వెంటనే వాటిని పొందండి.



# బంగ్లాదేశ్‌కు మహిళా ప్రధాని!

ఇప్పుడు బంగ్లాదేశ్‌లోనూ ఒక మహిళ ప్రధాని అయ్యారు. భారత ఉపఖండం లోని మిగతా మూడు దేశాలలో ఇంతకు ముందే ముగ్గురు మహిళలు ప్రభుత్వాలు నడిపారు.

ప్రపంచంలోనే తొలి మహిళా ప్రధాని అయిన శ్రీమతి సిరిమావో బండార నాయకే 1960 వ సం॥లో శ్రీలంక ప్రధాని పదవిని చేపట్టారు. అంతకు ఒక సంవత్సరం ముందు ఆమె భర్త ఎస్. డబ్ల్యు. ఆర్. డి. బండారనాయకే హత్యకు గురయ్యారు. తన భర్త అనంతరం అధికారం చేపట్టిన సిరిమావో 17 సంవత్సరాలు పరిపాలన జరిపారు.

భారత ప్రధాని లాల్‌బహదూర్‌శాస్త్రి 1966 వ సం॥ హఠాత్తుగా మరణించడంతో, ఆయన మంత్రి మండలిలోని శ్రీమతి ఇందిరాగాంధిని లోక్‌సభ కాంగ్రెస్‌పార్టీ నాయకురాలుగా ఎన్నుకున్నారు. ఆమె ప్రధాని అయ్యారు. వరసగా రెండుసార్లు ప్రధానిగా ఎన్నుకోబడిన ఇందిరాగాంధి 1977 వ సం॥ జరిగిన ఎన్నికలలో ఓడిపోయారు. కాని, రెండేళ్ళ తరవాత జరిగిన ఎన్నికలలో విజయం సాధించి 1984 వ సం॥ ఒక హంతకుడి తుపాకీ గుళ్ళకు బలి అయ్యేంతవరకు ఆమె తిరుగులేని నాయకురాలుగా కొనసాగారు.

ఇందిరాగాంధీ పరిపాలనా కాలంలోనే, తూర్పుపాకిస్తాన్ స్వతంత్ర బంగ్లాదేశ్‌గా రూపొందడానికి, భారతదేశం సహాయపడింది.

పాకిస్తాన్‌లో జుల్ఫికర్ అలీ భుట్టో, మొదట ప్రధాని అయ్యాడు. ప్రెసిడెంట్ యాహ్యాఖాన్ దేశం వదిలి పారిపోవడంతో భుట్టో అధ్యక్షపదవిని చేపట్టాడు. అయినప్పటికీ, ఆ తరవాత ఐదేళ్ళలో ఆయన పదవీచ్యుతుడై, విచారణకు లోనై ఉరి తీయబడ్డాడు. ఆ తరవాత, ఆయన కుమార్తె బెనజీర్‌భుట్టో రాజకీయ రంగ ప్రవేశం చేసింది. 1985 వ సం॥ జరిగిన ఎన్నికలలో బెనజీర్ నాయకత్వం

లోని పాకిస్తాన్ పీపుల్స్‌పార్టీ, అధికారంలోకి రావడంతో ఆమె ప్రధాని అయ్యారు. అయితే 1990 వ సం॥లో జరిగిన ఎన్నికలలో ఆ పార్టీ పరాజయం పొందింది.

బంగ్లాదేశ్ తొలి ప్రధానమంత్రి షేక్ ముజిబుర్ రహమాన్ 1975 వ సం॥లో ఆ దేశాధ్యక్షుడయ్యాడు. కాని ఆరు నెలలలోనే హతుడయ్యాడు. ఆ పిమ్మట దేశంలో ఎన్నో తిరుగుబాట్లు జరిగాయి. అటువంటి ఒక తిరుగుబాటు ద్వారా జనరల్ ఎర్షాద్ బంగ్లాదేశ్ అధ్యక్షుడయ్యాడు. ఎర్షాద్ ఎన్నికలు జరపకుండా ఎనిమిదేళ్ళు వాయిదా వేశాడు. అఖరికి వ్యతిరేకోద్యమాలు ఉధృతం కావడంతో ఎర్షాద్ రాజీనామా చేసి ఎన్నికలు జరిపాడు. ఆ ఎన్నికలలో బేగమ్ ఖలేదాజియా నాయకత్వంలోని బంగ్లాదేశ్ నేషనల్ పార్టీ అధికస్థానాలు గెలుచుకున్నది. ఏప్రిల్ 5 న బంగ్లాదేశ్ పార్లమెంటు జాతీయసంఘసద్ సమావేశమయింది. బేగమ్ ఖలేదాజియా ప్రధానమంత్రి పదవీబాధ్యతలు చేపట్టారు.

పొరుగున ఉన్న బర్మాలో కూడా మహిళా ప్రధాని వచ్చే అవకాశం ఉన్నది. గత సంవత్సరం జరిగిన ఎన్నికలలో షాత్యకు గురైన దేశ నాయకుడు ఆంగ్ సాన్ కుమార్తె పార్టీ ఘనవిజయం సాధించింది. అయితే బర్మా ప్రెసిడెంట్, ప్రజాస్వామ్య ప్రభుత్వం ఏర్పాటుకు ఇంకా అవకాశం ఇవ్వలేదు.





# న్యాయాధికారి బాధ్యత

సింగంపల్లి గ్రామంలో వుండే భీమరాజు వడ్డీవ్యాపారి. సోమయ్య అనేవాడు ఆయన దగ్గిర వెయ్యి వరహాలు అప్పు తీసుకుని, ఏడాది తర్వాత తీర్చడానికి వెళ్ళాడు. భీమరాజు వాడి దగ్గిర డబ్బు తీసుకోకుండా, "నువ్వు వడ్డీ మాత్రమే ఇస్తూండు. అసలు తీసుకోను," అన్నాడు.

ఇది విని సోమయ్య కంగారుపడి, "అలాగేం వద్దు మొత్తం బాకీ ఇప్పుడే తీర్చేస్తాను," అంటూ పట్టుబట్టాడు.

భీమరాజు నవ్వి, "మనం రాసుకున్న పత్రంలో నేనిచ్చిన డబ్బుకు ఏటా అయిదువందల వరహాలు వడ్డీ కట్టాలని వుంది తప్ప, బాకీ తీర్చాలని లేదు. అందువల్ల నువ్వు బాకీ తీర్చకూడదు. వడ్డీ కట్టాల్సిందే! ఇందుకు ఒప్పుకోక పోతే న్యాయాధికారికి ఫిర్యాదు చేస్తాను," అన్నాడు.

ఇద్దరూ న్యాయాధికారి దగ్గిరకు వెళ్ళారు. ఆయన పత్రాన్ని పరీక్షించి, "ఇందులో సోమయ్య అనే వ్యక్తి భీమరాజు వద్ద వెయ్యి వరహాలు అప్పు తీసుకున్నట్లూ, అందుకుగాను ఏటా అయిదు వందల వరహాలు వడ్డీగా జీవితాంతం ఇచ్చుకోవాలనీ వుంది. బాకీ తీర్చాలని ఎక్కడా లేదు. కాబట్టి నువ్వు వెంటనే అయిదు వందల వరహాలూ భీమరాజుకిచ్చుకోవాలి. లేదా జీవితాంతం కారాగారంలో వుండాలి," అన్నాడు.

చేసేదిలేక సోమయ్య, భీమరాజుకు అయిదువందల వరహాలూ ఇచ్చుకుని, అక్కడే ఏడుస్తూ కూలబడి పోయాడు. భీమరాజు వెళ్ళిపోగానే న్యాయాధికారి వాణ్ణి ఓదార్చి, "భీమరాజు మోసగాడు. అలాంటి వాళ్ళతో వ్యవహరించేటప్పుడు, నీవంటివాళ్ళు తెలివిగా వుండాలి. జరిగిం

"వసుంధర"




దేదో జరిగిపోయింది. భీమరాజు నుంచి తప్పించుకునేందుకు నీకొక ఉపాయం చెబుతాను. దానితో నువ్విప్పుడాయన కిచ్చిన అయిదువందల వరహాలూ కాక, ఒక్క వరహా కూడా ఇవ్వనవసర ముండదు. అయితే, ఈ క్షణం నుంచీ నీ పేరు సూరయ్యగా మార్చుకో. నువ్వు పేరు మార్చుకున్నట్లు నేను ఖరారు పత్రాన్ని ఇస్తాను. భీమరాజుకు వడ్డీ కట్టాల్సింది సోమయ్యే కానీ సూరయ్య కాదుకదా!'' అన్నాడు.

సోమయ్య సంతోషంగా ఖరారు పత్రం తీసుకుని ఇంటికి వెళ్ళిపోయాడు. ఏడాది తర్వాత భీమరాజు వడ్డీ గురించి అడిగితే సోమయ్య, ''డబ్బు గురించి సోమయ్య నడుగు. నా పేరు సూరయ్య.'' అంటూ ఖరారు పత్రం చూపించాడు.

అంత తెలివి సోమయ్యకు లేదనీ, న్యాయాధికారే వాడికి ఆ ఉపాయం చెప్పి వుంటాడనీ, భీమరాజు గ్రహించాడు. మళ్లీ ఏదో ఒక ఉపాయం పన్ని సోమయ్య నుంచి డబ్బు రాబట్టాలని అనుకుంటూ, భీమరాజు అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

ఇది జరిగిన కొన్నాళ్ళకు, ఒక భాగ్యవంతుడు వెతుక్కుంటూ సోమయ్య ఇంటికి వెళ్ళి, ''ఈ ఇంట్లో వుండే సోమయ్య అనే అతడికి నేను లక్షవరహాలు ఇవ్వాల్సివుంది. సోమయ్య తండ్రి నా తండ్రిని ప్రాణప్రమాద సమయంలో రక్షించాడట. అందుకు ప్రతిఫలమివ్వాలని ఆయన కోరిక. నేను ఇన్నాళ్ళూ డబ్బు ఇబ్బందుల్లో వుండి వెంటనే ఆయన కోరిక తీర్చలేకపోయాను. ఇన్నాళ్ళకు నాకా అవకాశం వచ్చింది!'' అన్నాడు.

వెతుక్కుంటూ వచ్చిన ఈ అదృష్టానికి సోమయ్య ఎంతో సంతోషించి, తనే సోమయ్యనని చెప్పాడు.

''నువ్వే సోమయ్యవని నేనెలా నమ్మేది? ఈ ఊళ్ళోని పెద్దమనిషి ఎవరైనా నువ్వే సోమయ్యవని ధృవపర చాలి,'' అన్నాడు భాగ్యవంతుడు.

ఆ గ్రామంలో పెద్ద మనుషులకు పెద్ద మనిషి భీమరాజు. సోమయ్యా, భాగ్యవంతుడూ ఆయన దగ్గిరకు వెళ్ళారు.

భీమరాజు, సోమయ్యను, "నీ పేరు మార్చుకున్నా, లోగడ సోమయ్య పేరుతో చేసిన బాకీలన్నిటికీ జవాబుదారీ వహిస్తావా?" అని అడిగాడు.

ఇది విని సోమయ్య ఆలోచనలో పడ్డాడు. భీమరాజు చెప్పిందానికి ఒప్పుకోకపోతే లక్షవరహాలూ పోతాయి. ఒప్పుకుంటే లక్షవరహాలు వస్తాయి. అప్పుడు భీమరాజుకు ఏటా అయిదువందల వరహాలివ్వడం కష్టం కాదు!



ఈ వ్యవహారంలో మోసముందని తెలియక సోమయ్య, భీమరాజు కోరిన విధంగా తిరిగి పత్రం రాసిచ్చాడు. అందువల్ల వాడికి భాగ్యవంతుడి నుంచి లక్ష వరహాలు రాలేదు కానీ, భీమరాజు వడ్డీ ఇవ్వమని వేధించసాగాడు.

చేసేదిలేక సోమయ్య మళ్ళీ న్యాయాధికారిని కలుసుకుని జరిగింది చెప్పాడు. న్యాయాధికారి, "ఒకసారి మోసపోయాక తెలివిగా వుండవద్దా? భీమరాజు నీ దగ్గిర్నుంచి డబ్బు రాబట్టడానికి ఎన్ని నాటకాలైనా ఆడగలడు. ఉన్నట్లుండి ఎవరో నీకు లక్షవరహాలిస్తారంటే ఎలా నమ్మావు?" అంటూ మందలించాడు.

"అయ్యా, ఇక మీదట జాగ్రత్తగా వుంటాను. ఈ ఒక్కసారి రక్షించండి!" అన్నాడు సోమయ్య.

న్యాయాధికారి వెంటనే భీమరాజుకు కబురు పంపి రప్పించి, "ఈ సోమయ్య నీకు ఏటా అయిదువంద లివ్వాలి. కానీ ఇవ్వడం లేదు, అవునా? అందువల్ల ఇతణ్ణి కారాగారంలో వేస్తున్నాను. ఇంకెవరైనా నీ బాకీ తీరుస్తామని హామీ ఇస్తే తప్ప, ఇతణ్ణి కారాగారం నుంచి విడుదల చేయను," అని చెప్పాడు.

ఇందుకు భీమరాజు ఎంతో సంతోషించి, సోమయ్య ఇంటికి వెళ్ళి జరిగింది చెప్పి, "ఇల్లో, పొలమో అమ్మి నాకు ఏటా




వడ్డీ కడతానని పత్రం రాసివ్వండి. లేకుంటే సోమయ్య బ్రతికున్నంతకాలం కారాగారంలో మగ్గిపోవాల్సిందే!'' అన్నాడు సోమయ్య భార్యాబిడ్డలతో.

అప్పటికే న్యాయాధికారి హెచ్చరిస్తూ పంపిన కబురందడంవల్ల, సోమయ్య భార్య దీనికి చలించక, ''ఆయన ఇంట్లో వుండి మాత్రం మాకేం లాభం? లేనిపోని అప్పులు చేసి మా పీకల మీదికి తెస్తాడు. ఆయన్ని కారాగారంలోనే వుండనివ్వండి,'' అన్నది.

ఇలా ఎన్నాళ్ళు జరుగుతుందో చూద్దామని, భీమరాజు తనూ ఊరుకున్నాడు. అయితే వారం రోజుల తర్వాత సోమయ్య కారాగారం నుంచి తిరిగి వచ్చాడు. కారణమేమంటే—ఆ దేశపురాజుకు లేక లేక కొడుకు పుట్టాడు. ఆ శుభసందర్భంలో కారాగారంలో వుండే చిల్లరనేరస్థుల్ని విడిచిపెట్టేశారు.

భీమరాజు సోమయ్యను కలుసుకుని, ''నువ్వు కారాగారం నుంచి తిరిగి వచ్చినందుకు నాకు చాలా సంతోషంగా వుంది. ఇక నా వడ్డీ కట్టు!'' అన్నాడు.

''నీకు డబ్బు ఎగవేసినందుకు నాకు శిక్ష పడింది. కాబట్టి నేనిక నీకు బాకీ లేనట్లే లెక్క!'' అన్నాడు సోమయ్య.

భీమరాజు న్యాయాధికారిని చూడబోతే, ఆయన సోమయ్య మాటలు న్యాయసమ్మతమే అన్నాడు.

కొద్ది రోజుల తర్వాత భీమరాజు ఒక కొత్త ఉపాయం పన్నాడు. ఆ ప్రకారం ఎంతో పెద్ద మనిషిలా వున్న వాడొకడు సోమయ్య ఇంటికి వెళ్ళి, వాడికి ఒక పత్రాన్ని చూపించాడు. అందులో, ఆ మనిషి చాలా కాలంగా సోమయ్యకు తెలిసినవాడనీ, నమ్మకస్థుడనీ, అతడికి తప్పక ఉద్యోగం ఇవ్వవచ్చుననీ ఉన్నది.

''అయ్యా, ఎంతో కాలంగా ఎలాంటి ఉద్యోగమూ లేక అవస్థలుపడుతున్నాను. న్యాయాధికారి మీకు మంచి స్నేహితుడు

గదా! ఈ పత్రం చివర మీరు సంతకం చేస్తే, నాకాయన ఉద్యోగం ఇస్తారు," అన్నాడు వాడు.

అందువల్ల తనకేమీ నష్టం లేదని భావించి సంతకం చేశాడు, సోమయ్య. అయితే అసలు మోసం వాడికి తెలియదు. కొద్దిసేపటికి ఆ పత్రంలో వాడిన మాయ సిరా కారణంగా, మిగతా అక్షరాలన్నీ మాయమై సోమయ్య సంతకం మాత్రమే మిగిలింది!




కారాగారం నుంచి తిరిగి వచ్చాక, డబ్బు అవసరమై తను భీమరాజు నుంచి పదివేల వరహాలు అప్పు చేసినట్లూ, అందుకుగాను ఏటా వెయ్యి వరహాలు వడ్డీగా ఇచ్చుకుంటాననీ, భీమరాజు ఆ పత్రం పైన రాసి హుటాహుటిన న్యాయాధికారి వద్దకు వెళ్ళాడు.

న్యాయాధికారి ఆ పత్రం చూసి, తర్వాత కబురు పంపుతానని భీమరాజును పంపేసి, సోమయ్యను పిలిపించి, "నీకింకా బుద్ధి రాలేదా? మళ్ళీ ఎందుకలా చేశావు?" అని అడిగాడు.

సోమయ్య లబోదిబోమంటూ, తనొక సిఫారసు పత్రం మీద మాత్రమే సంతకం పెట్టానని, జరిగింది చెప్పాడు.

మాయసిరాతో భీమరాజు, సోమయ్యను మోసగించాడని న్యాయాధికారి గ్రహించి, "మూర్ఖుడా! నేరస్థులు నానాటికీ తెలివి మీరుతూంటే, నీ తెలివిమాత్రం పెరగడం లేదు. నిన్ను రక్షించడం నావల్లకాదు," అంటూ మండిపడ్డాడు.

"అయ్యా! నేరస్థుల బారి నుంచి నావంటి అమాయకుల్ని రక్షించడానికే గదా, మీరున్నది," అన్నాడు సోమయ్య.

దీనికి న్యాయాధికారి మరింత మండిపడి, "ఒకసారి రక్షిస్తాను. రెండుసార్లు రక్షిస్తాను. ఎల్లకాలమూ రక్షించడం, నావల్ల కాదు. ఒకసారి అనుభవం అయ్యాక, నీబోటివాళ్ళు నేరస్థుడికంటే తెలివిగా వుండి జాగ్రత్తపడాలి. లేకుంటే అనుభవించాలి," అన్నాడు.

"అయ్యా, తమరు నన్ను రక్షించనవసరం లేదు. కానీ నన్నొక సందేహం పీడిస్తున్నది. ఆగ్రహించరనుకుంటాను. మీ బాధ్యత ఏమిటి? నావంటి అమాయకులను రక్షించడమా లేక నేరాల్ని అరికట్టడమా?" అని అడిగాడు సోమయ్య.

"రెంటికీ తేడా ఏమిటి?" అన్నాడు న్యాయాధికారి కోపాన్ని అణచుకునేందుకు ప్రయత్నిస్తూ.

"అయ్యా, చాలా తేడా వుంది. నావంటి అమాయకులు మాటిమాటికీ మోసపోతే, ఆ తప్పు మాదేనని ఒప్పుకుంటాను. కానీ నేరాల్ని అరికట్టడానికి మీరొక ప్రయత్నం చేస్తే, నేరస్థుడు తెలివిమీరి ఇంకో ఉపాయం పన్నుతున్నాడు. నేరస్థుడు నేరం చేయకుండా ఆపే తెలివి మీకు లేదా? నేరస్థుడి తెలివితో మీరు పోటీపడి, వాడెప్పటికీ నేరం చేయకుండా మీరాపలేరా? న్యాయాధికారి అయిన మీకు చేతకానిపని, నాబోటి సామాన్యుడి వల్ల అవుతుందా?" అని అడిగాడు సోమయ్య.

ఇది విన్నాక న్యాయాధికారికి తన తప్పు తెలిసివచ్చింది. ఆయన, అప్పులిచ్చేవాళ్లు తమకు తోచిన విధంగా పత్రాలు రాయించుకోరాదనీ, న్యాయాధికారి అయిన తన ఎదుట రాసుకున్న పత్రాలు మాత్రమే చెల్లుతాయనీ చాటింపు వేయించాడు.

నాలుగు రోజుల తర్వాత భీమరాజు, న్యాయాధికారిని కలుసుకుని, సోమయ్య బాకీ సంగతి గురించి అడిగాడు.

అందుకు న్యాయాధికారి కళ్ళెర్రచేసి, "సోమయ్య ఏపాటి ఆస్తిపరుడో అందరికీ తెలుసు. అలాంటి వాడికి, ఏ తాకట్టూ లేకుండా, సాక్షులు లేకుండా పదివేల వరహాలు అప్పుగా ఇచ్చావంటే, నువ్వు తెలివితక్కువవాడివైనా అయుండాలి లేక మోసకారివయినా అయుండాలి. నువ్వు తెలివి తక్కువవాడివి కాదని అందరూ ఎరుగుదురు. ఇక వెళ్ళు!" అన్నాడు.

ఆ తర్వాత సోమయ్య వంటి పేద వాళ్ళకు, మాటిమాటికీ న్యాయాధికారి సాయం పొందవలసిన అవసరం తప్పింది.






## 4

[అపూర్వుడు నమీరుడనే కుర్రవాణ్ణి, బందిపోట్ల నుంచి రక్షించాడు. అపూర్వుడి ఆదేశానుసారం, నమీరుడు, దొంగలను సైనికునికులకు పట్టి ఇచ్చాడు. రాజు వాళ్ళకు మరణశిక్ష విధించాడు. తమ పాపకృత్యాలకు పశ్చాత్తాపం చెందిన దొంగలను క్షమించమని అపూర్వుడి మాటగా నమీరుడు రాజుకు చెప్పాడు. కాని, రాజు అందుకు అంగీకరించలేదు. —తరవాత]

బందిపోట్లను బంధించిన కారాగార గృహంలోని చీకటి గదిలో భయంకరమైన నిశ్శబ్దం అలముకున్నది. ఒక దొంగ మూలుగుతూ, ''రాజుగారు మనల్ని నిజంగానే క్షమించగలరని, అనుకుంటున్నావా?" అని పక్కన కూర్చున్నవాణ్ణి అడిగాడు.

''ఆ దేవుడు కరుణిస్తే తప్ప, మనం చావు నుంచి తప్పించుకోలేము,'' అన్నాడు పక్కవాడు మరింత దీనంగా.

వాళ్ళ మాటలు విన్న భైరవమల్లు, "ఎందుకలా పిరికిపందల్లాగా ఏడుస్తారు?" అన్నాడు కోపంగా.

''పిరికిపందలు! పిరికిపనులు కాకపోతే మనం ఇన్నాళ్ళు చేసిన పనులు సాహసకృత్యాలా? నిరాయుధులయిన అమాయక బాటసారుల మీద పడి దోచుకోవడం; నిస్సహాయులయిన పసిబిడ్డలను పట్టుకుపోవడం; అడ్డుకోలేని బలహీనుల



పైబడి, బాధించి హడలగొట్టడం ఇటు వంటి పనులను పిరికివాళ్ళు కాక ఇంకెవరు చేయగలరు? ఎవళ్ళో కష్టపడి సంపాయించిన ధనాన్ని అపహరించి, దాంతో మనం ఆనందంగా బతుకులు సాగించామే, అంతకన్నా సిగ్గులేని కృత్యం ఏమిటి? అయినా, మాకీ పిరికితనం నేర్పిందెవరు? నువ్వేకదా? ఆ సంగతే మరిచిపోయావా?'' అన్నారు దొంగలు.

వాళ్ళ ప్రశ్నలకు భైరవమల్లు సమాధానం చెప్పలేక మౌనంగా ఊరుకున్నాడు.

అప్పుడు, అంతకు పూర్వం వాళ్ళకు వినిపించిన అపూర్వుడి మధుర కంఠస్వరం మళ్ళీ వినిపించింది: ''మీరందరూ అభంశుభం ఎరుగని పసిబిడ్డల్లా మాట్లాడుతున్నారేమిటి? నేరమంతా భైరవమల్లు మీదికి తోసి, ఇంకా మిమ్మల్ని మీరే మోసం చేసుకోకండి. మీరు తెలిసే నేరాలు చేసినవాళ్ళు. మీ తప్పులకు మీరే బాధ్యులు. కాబట్టి మీరు శిక్షార్హులు!''

ఆ మాటలు విన్నాక ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

కొంతసేపయ్యాక భైరవమల్లు, మాటలు వినిపించిన దిక్కుకేసి చూస్తూ, ''దేవా! నువ్వు మమ్మల్ని నిజంగానే రక్షించగలవా? మమ్మల్ని ఉరితీసే రోజు ఫలానా అని నిర్ణయించినట్లు కారాగారగృహ రక్షకభటులు చెబుతున్నారు!'' అన్నాడు.

''నిర్మలమైన మనస్సులతో, దేవుణ్ణి ప్రార్థించండి. మంచి మనసులకు తప్పక మేలేజరుగుతుంది!" అన్నాడుఅపూర్వుడు.

* * *

ఇన్నాళ్ళు పట్టిపీడించిన బందిపోట్ల బెడద ఈ రోజుతో విరగడవుతుందని ప్రజలందరూ పట్టరాని ఆనందోత్సాహాలతో ఉన్నారు. బందిపోట్లను సూర్యోదయాని కల్లా ఉరి తీయాలని ప్రకటించారు.

తెల్లవారకముందే పట్టణప్రజలు, వధ్యస్థానం సమీపంలో గుంపులు గుంపులుగా చేరారు. మరికొందరు కారాగార గృహం నుంచి, వధ్యస్థానం వరకు గల బాటకు

ఇరువైపులా బారులుతీరి నిలబడ్డారు. కొత్వాలు ఒక గుర్రం మీద ముందుగా బయలుదేరాడు. ఆయన వెనక సైనికులు, చేతులు బంధించిన దొంగలను వధ్య స్థానం కేసి నడిపించారు. దొంగలకు ముందూ, వెనకా, ఇరువైపులా ఆయుధాలు ధరించిన సైనికులు నడుస్తున్నారు.



దారికి ఒక వైపున నిలబడి వాళ్ళను చూస్తున్న జనం నుంచి, ఒక స్త్రీ హఠాత్తుగా ముందుకు దూకి, "హంతకుడా, పాతకుడా!" అంటూ భైరవమల్లు ముఖం మీదకొట్టి, "నా భర్త స్నేహితులతో కలిసి, దూరప్రాంతాలకు వెళ్ళి, ధనంతో తిరిగి వస్తూండగా ఈ దుర్మార్గులు డబ్బు మూటను కాజేయడానికి చూశారు. కాని నా భర్త, చేతిలోని కర్రతో ఈ దుర్మార్గుల చేతులు విరగ్గొట్టాడు. దాంతో బెదిరిపోయి పారిపోయిన ఈ పిరికిపందలు, కొంత సేపటికి దొంగచాటుగా వచ్చి, వెనక నుంచి నా భర్తను చంపి, దగ్గరున్న ధనం దోచుకుపోయారు!" అని నెత్తీ నోరు బాదుకుని ఏడ్వసాగింది.

ఆమె మాటలు విని రెచ్చిపోయిన కొందరు ప్రజలు భైరవమల్లును కొట్టబోయారు. దానిని గమనించిన కొత్వాలు, గుర్రాన్ని వెనక్కు మళ్ళించి, "మీ బాధ, చెప్పరానిదే. మీ ఆగ్రహం న్యాయమైనదే. కాని, తాము చేసిన ఘోరాలన్నిటికీ ఫలితంగా, మరణశిక్ష అనుభవించడానికి వెళుతూన్న ఈ దొంగల మీద ఈ సమయంలో పగ సాధించడానికి పూనుకోవడం భావ్యం కాదు. ఓర్పు వహించండి," అని హెచ్చరించాడు.

భైరవమల్లు చేతులు పైకెత్తి కన్నీళ్లతో, "తల్లీ, నేను పాపాత్ముణ్ణే. అందులో సందేహం లేదు. నీ భర్తనే కాదు. ఈ లోకంలో అనేకమంది భర్తలనూ, తండ్రులనూ, కొడుకులనూ చంపినపరమ కిరాతకుణ్ణి. మీరు నన్ను క్షమించినా, ఆ దేవుడు నన్ను శిక్షించకమానడు. నాకు నరకం తప్పదు," అన్నాడు దీనస్వరంతో.



ఆ మాటలు విని ప్రజలు శాంతించారు. భైరవమల్లును చెంపదెబ్బకొట్టిన స్త్రీ కూడా బాధగా నిట్టూర్చింది.

కొత్వాలు, భైరవమల్లు కేసి తిరిగి, "ఇప్పుడు మీరు చేసిన తప్పుకు పశ్చాత్తాప పడుతున్నారు. అయితే, మీరు చేసిన నేరాలు క్షమించరానివి. మీరు ప్రాణం తీయడానికి పూనుకున్న సమీరుడే, మీ ప్రాణాలు రక్షించాలని రాజుగారిని ప్రార్థించాడు. కాని, మీ దురదృష్టం కొద్దీ రాజుగారు అందుకు అంగీకరించలేదు!" అన్నాడు కొత్వాలు.

"ఏమీ చేయలేమని నాకు తెలుసు. పాపాత్ముడనైన నాకు మరణం తప్పదు. కాని, నా తోటివాళ్ళు చేసిన పాపాలన్నిటికీ కారణం నేను. అందువల్ల వాళ్ళను వదిలిపెట్టి నన్ను చిత్రవధ చేసి చంపండి. వందసార్లయినా మరణించడానికి నేను సిద్ధంగా ఉన్నాను," అన్నాడు భైరవమల్లు.

ఆ మాటలకు కొత్వాలు నవ్వి, "రాజుగారి తీర్పుకు తిరుగులేదు. తీర్పును పునః పరిశీలన చేయమని ప్రార్థించడానికి సమయం దాటిపోయింది. మీలో లేనిపోని ఆశలు కలిగించలేను. మీరందరూ ఉరి కంబం ఎక్కక తప్పదు," అన్నాడు.

అందరూ వధ్యస్థానం సమీపించారు. దాదాపు ఇరవైమంది వరకు వున్న దొంగలందరినీ, ఎత్తుగా వున్న మట్టిదిబ్బ మీదికి నడిపించారు. మట్టిదిబ్బ మీద ఉరి కంబం ఉన్నది. ఉరి కంబం మధ్య నుంచి ఉరితాడు వేలాడుతున్నది! కొత్వాలు కటికవాణ్ణి, "అంతా సిద్ధమే కదా?" అని అడిగాడు.

"సిద్ధం,ప్రభూ!" అన్నాడుకటికవాడు.

"భైరవమల్లును మొదట ఉరితీయాలి. ఆ తరవాత మిగతావాళ్ళు!" అన్నాడు కొత్వాలు.

ఇద్దరు భటులు భైరవమల్లును ఉరి కంబం దగ్గరికి తీసుకు వెళ్ళారు.

"భైరవా, నీ ఆఖరి ప్రార్థన ఏదైనా వుంటే కానీ," అన్నాడు కొత్వాలు.



భైరవమల్లు చేతులు జోడించి, ''నావల్ల కష్టాలపాలైన వాళ్ళకందరికీ క్షమాపణలు చెప్పుకుంటున్నాను. నా పాపాలన్నిటినీ క్షమించి రక్షించమని దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను,'' అన్నాడు.

కటికవాడు భైరవమల్లును ఉరికంబం మధ్య నిలబెట్టి, వాడి గొంతుకు ఉరితాడు తగిలించాడు.

మట్టిదిబ్బకు దిగువ నిలబడిన జనం నిశ్శబ్దంగా, ఊపిరులు బిగబట్టుకుని చూస్తున్నారు.

కొత్వాలు కటికవాడితో, ''నేను ఒకటి నుంచి పదివరకు లెక్కపెడతాను. పది అనగానే నువ్వు తాడును లాగాలి. సరేనా !'' అన్నాడు.

"చిత్తం ప్రభూ!" అన్నాడు కటికవాడు.

కొత్వాలు నెమ్మదిగా ఒకటీ, రెండూ అని లెక్కించడం మొదలు పెట్టాడు.

అక్కడ చేరిన జనం ఒకవైపు భయం, మరొకవైపు ఉత్సాహంతో చూస్తున్నారు.

సూర్యోదయమై లేత ఎండ ఉరికంబం మీద పడుతున్నది. బలమైన ఉరితాటికి నూనె రాసినట్టున్నది. అందువల్ల అది సూర్యకిరణాలకు తళతళ మెరుస్తున్నది.

''ఎనిమిది !'' అన్నాడు కొత్వాలు.

కటికవాడి చేతులు తాటిని గట్టిగా బిగించి పట్టుకున్నాయి.

''తొమ్మిది !'' అన్నాడు కొత్వాలు ఎంతో గంభీరంగా.

ఉరికంబం పక్కన అర్ధవృత్తాకారంలో నిలబడిన దొంగలు ఏడవసాగారు.

''పది !''

భటుడు బలంగా తాటిని లాగాడు. ఆ ఊపుకు భైరవమల్లు శరీరం పైకి వెళ్ళి వుండాలి. కాని, అలా జరగలేదు. పైగా, ఉరితాడు ఉచ్చుకు పైన కాస్త తెగిపోయింది!

"ఏమిటది ?" అని అరిచాడు కొత్వాలు.

కటికవాడు నోరు తెరవలేకపోయాడు. వాడు ఎందరినో ఉరి తీశాడు. ఇటువంటి సంఘటనఅంతకుముందెన్నడూజరగలేదు



అంతవరకు దిబ్బకు దిగువ నిలబడిన ముగ్గురు రాజోద్యోగులు దిబ్బ మీదికి వచ్చి, "తాడు గట్టిగా వుందో లేదో చూశావా, లేదా ?" అని అడిగారు.

"క్షుణ్ణంగా పరిశీలించి చూశాను," అన్నాడు కటికవాడు.

"ఆలస్యం దేనికి ? మరొకసారి ఉరి తియ్ !" అని ఆజ్ఞాపించాడు కొత్వాలు.

కటికవాడు కొత్త తాడు తెచ్చి, రాజోద్యోగులకు చూపి, పరిశీలించిన తరవాత, కంబానికి కట్టి, ఉరి తాటిని భైరవమల్లు మెడకు బిగించి, కొత్వాలు మునుపటిలా 'పది' అనగానే మళ్ళీ తాడును లాగాడు.

మళ్ళీ ఉరితాడు పుటుక్కున తెగిపోయింది !

ఆ వింతను చూసి ఆశ్చర్యంతో, ఎవరూ మాట్లాడలేకపోయారు. కొంతసేపయ్యాక కొత్వాలు, "ఇదేదో మానవాతీతమైన అద్భుతశక్తి ద్వారానే ఇలా జరుగుతున్నది ! ఈ సంగతిని రాజుగారికి తెలియజేయాలి. ఇప్పుడే తిరిగి వస్తాను. నేను వచ్చేలోగా మరొక తాటిని సిద్ధం చేయండి," అని చెప్పి, గుర్రం మీద బయలుదేరాడు.

కొంతసేపటికి, కొత్వాలు రాజూ, మంత్రీ, సేనాధిపతులతో సహా వధ్యస్థానానికి వచ్చాడు.

రాజు స్వయంగా తాడును పరిశీలించి చూశాడు. ఆ తరవాత కటికవాడు ఉచ్చు వేసి భైరవమల్లు మెడకు తగిలించాడు.

కొత్వాలు యథాప్రకారం, ఒకటీ, రెండూ అని ప్రారంభించి, పది అనగానే ఉరితాడు ఫట్‌మని తెగింది!

ఆ వింతను మూడోసారి చూసిన ప్రజలు ఆశ్చర్యంతో 'ఆహా' అని కేక వేశారు.

రాజు కొంతసేపు మౌనం వహించి, తరవాత తల పంకిస్తూ, "ఎటువంటి కారణమూ లేకుండా, దృఢమైన తాడు వరుసగా మూడుసార్లు ఎలా తెగిపోతుంది ? దీనికి ఏదో బలమైన కారణమే

ఉండాలి. హంతకులయిన ఈ దొంగలను కాపాడాలని సంకల్పించినప్పుడు, ఆ దేవుణ్ణే ఏదైనా అద్భుతం చూపి రక్షించు కోమని, నేను సమీరుడితో అన్నాను. ఆ అద్భుతం నా కళ్ళ ఎదుటే జరిగింది. భైరవమల్లును వదిలిపెట్టండి. వాణ్ణేకాదు; వాడి అనుచరులను కూడా వదలండి. అయితే, వాళ్ళు మన పర్యవేక్షణలో ఇకమీదట పాపరహితమైన నూతన జీవితాలు ప్రారంభించాలి!'' అన్నాడు.

రాజు మాటలు విని, ప్రజలు ఆనందాతిరేకంతో హర్షధ్వానాలు చేశారు.

భటులు, దొంగల కాళ్ళకూ, చేతులకూ తగిలించిన సంకెళ్ళను తొలగించారు. వాళ్ళందరూ రాజు పాదాలపైబడి నమస్కరించారు.

''మీరు కృతజ్ఞత చూపవలసింది, మిమ్మల్ని మరణం నుంచి కాపాడడానికి తన అదృశ్యశక్తిని ప్రదర్శించిన ఆ దేవుడికి. ఆ కరుణామయుడి దయకు పాత్రులయ్యే విధంగా మీ భావిజీవితాలను సక్రమమార్గంలో సరిదిద్దుకోవాలి,'' అని దీవించాడు రాజు.

'మహారాజుకూ జై' అంటూ ప్రజలు జయజయ ధ్వానాలు చేశారు.

* * *

అరణ్య ప్రాంతంలో ఏకాంతంగా కూర్చున్న అపూర్వుడికి నమస్కరించి, ''ఆ అద్భుతం ఎలా సాధ్యమయింది?'' అని అడిగాడు సమీరుడు.

''వేగంగా పరిగెత్తినప్పుడు, ఒక స్థాయికి చేరగానే నేను, ఎదుటివారికి కనిపించకుండా గాలిలో గాలిగా కలిసి పోతాను. తగిన దూరంలో నిలబడి, కొత్వాలు 'ఐదు' అని అన్నప్పుడు పరిగెత్తుకుంటూ వధ్యస్థానాన్ని సమీపించే సరికి వేగం పెరిగి అదృశ్యమయ్యేశక్తిని పుంజుకుని, గాలిలో కలిసిపోయి, పది అనగానే చేతిలోని కత్తితో ఉరి తాడును తెగవేసి, మళ్ళీ వెనుదిరిగి వెళ్ళి, యథాస్థానం చేరుకునేవాణ్ణి,'' అని వివరించాడు అపూర్వుడు.

—(ఇంకావుంది)






# గురుదక్షిణ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఎవరిమీదనైనా పగా, ద్వేషం కొద్దీ, ఏదో సాధించితీరాలన్న పట్టుదలతో, నువ్విన్ని శ్రమలకు ఓర్పు వహిస్తున్నావేమో, నాకు తెలియదు. కాని, తీరా పగసాధించే అవకాశం దొరికినప్పుడు, అపకీర్తి భయం వల్లనో లేక మరే కారణంచేతనో, చాలా మంది అసందర్భంగా ప్రవర్తిస్తారు. ఇందుకు ఉదాహరణగా యజ్ఞకర్ముడనే మునికథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

హిమగిరి రాజ్యంపాలించే వీరసేనుడికి, విజయవర్ధనుడు ఒక్కగానొక్క కొడుకు. అతడికి సమస్త విద్యలూ నేర్పించి, మహా

**బేతాళ కథలు**



వీరుడుగా తీర్చిదిద్ద సంకల్పించి, తగిన గురువుకోసం ఆయన అన్వేషిస్తున్న సమయంలో, రాజధానికి దూరంగా శాంతి వనంలో గురుకులం నడుపుతూ తపస్సు చేసుకుంటున్న యజ్ఞకర్మ డనే ముని గురించి తెలియవచ్చింది.

ఒక మంచిరోజున వీరసేనుడు, కుమారుడిని వెంటబెట్టుకుని రథంమీద బయలుదేరిపోయి, యజ్ఞకర్ముణ్ణి దర్శించి, "మునీశ్వరా! నేనీ రాజ్యానికి రాజును. వీడు నా కుమారుడు, కాబోయే మహారాజు. నా కుమారుడికి విద్య నేర్పే సువర్ణావకాశం మీకు కల్పిస్తున్నాను. ఇకనుంచి వీడి బాధ్యతమీదే!" అన్నాడు.

అందుకు యజ్ఞకర్ముడు, "రాజా, నావద్దకు విద్యనేర్చుకోవడానికి వచ్చిన వాడు రాజుకొడుకైనా, కూలివాడికొడుకైనా నాకొక్కటే. అటువంటప్పుడు నీ కుమారుడికి విద్య నేర్పడం, నాకు సువర్ణావకాశమేమీకాదు! అదీకాక, నేనింకా నీ కుమారుడిని శిష్యుడుగా స్వీకరించడానికి సమ్మతించలేదు," అన్నాడు.

"సాక్షాత్తూ మహారాజే వచ్చి అడుగుతున్నప్పుడు, మీరంగీకరించకుండా ఎలా వుండగలరన్న నమ్మకంతో, అలా మాట్లాడాను," అన్నాడు వీరసేనుడు.

"అందరి మంచి చెడ్డలూ చూడవలసిన బాధ్యత గలవాడివి, ఇలా అహంకార పూరితంగా మాట్లాడడం తగదు," అన్నాడు యజ్ఞకర్ముడు.

ఆ మాటకు వీరసేనుడు కోపగించుకుని, "మీతో వాదన అనవసరం. నా కుమారుణ్ణి శిష్యుడిగా స్వీకరించి విద్యాబుద్ధులు నేర్పుతారా, లేదా?" అని ప్రశ్నించాడు.

యజ్ఞకర్ముడు కొంచెంసేపు ఆలోచించి, "నావద్దకు వచ్చిన, ఈ చిరంజీవి ముఖం చూసి విద్యాబోధన చేయడానికి సమ్మతిస్తున్నాను," అన్నాడు.

యజ్ఞకర్ముడి మాటలకు వీరసేనుడి అహం దెబ్బతిన్నది. అయినా కోపావేశాన్ని

అణచుకుని, కొడుకును అక్కడ విడిచి వెళ్ళిపోయాడు.

అనాటినుంచి యజ్ఞకర్ముడు, విజయవర్ధనుడికి విద్యాబోధన ఆరంభించాడు. పదహారు సంవత్సరాలు నిండేసరికి, విజయవర్ధనుడు వేదవేదాంగాలను క్షుణ్ణంగా అభ్యసించాడు. ఖడ్గచాలనం, అశ్వారోహణం వంటి వీరవిద్యలలో అసమాన ప్రజ్ఞాపాటవాలను సాధించాడు.

ఒక రోజున యజ్ఞకర్ముడు, విజయర్ధనుడిని చేరబిలిచి, "నాయనా! నేటితో నీ విద్యాభ్యాసం ముగిసింది. రాజధానికి పోయి పట్టాభిషిక్తుడివై, మంచి రాజుగా కీర్తివంతుడివికా. నీకు నా ఆశీస్సులు ఎల్లవేళలా వుండగలవు." అన్నాడు.

విజయవర్ధనుడు, గురువు పాదాలకు నమస్కరించి, "గురువర్యా! మీకేదైనా గురుదక్షిణ ఇచ్చుకోవాలని వున్నది. సెలవీయండి!" అన్నాడు.

ఆ మాటలకు యజ్ఞకర్ముడు చిరునవ్వు నవ్వి, "విజయా! నీవంటి ఉత్తముడు శిష్యుడుగా దొరకడమే, నాకు సంతోషదాయకం. ఎటువంటి గురుదక్షిణా ఆశించడం లేదు," అన్నాడు.

ఇందుకు విజయవర్ధనుడు అంగీకరించక, "నా సంతృప్తికోసమైనా, ఏదైనా కోరండి," అని బలవంతం చేశాడు.




విజయవర్ధనుడి మనోగతం అర్థం చేసుకున్న యజ్ఞకర్ముడు, "చిరంజీవీ! నీ సంతృప్తికోసం గురుదక్షిణ కోరుతాను. అయితే ఇప్పుడు కాదు; అవసరం అయినప్పుడు అడుగుతాను," అన్నాడు.

విజయవర్ధనుడు, గురువుకు పాదాభివందనం చేసి రాజధాని చేరాడు. అన్ని విద్యలలో ఆరితేరి వచ్చిన కుమారుణ్ణి చూసి, రాజు వీరసేనుడు సంతుష్టి చెందాడు. అయితే, ఆయనకు తాను లోగడ గురుకులానికి వెళ్ళినప్పుడు, తనను తగువిధంగా గౌరవించని యజ్ఞకర్ముడి మీద పగసాధించాలన్న బుద్ధి పుట్టింది.

ఆ మర్నాడు వీరసేనుడు, కొందరు సైనికులను పిలిపించి, వాళ్ళతో, "మీరు యజ్ఞకర్ముడి ఆశ్రమానికి పోయి, నన్ను శరణు కోరేంతవరకూ అతడికి శాంతి లేకుండా చేస్తానని చెప్పండి. సమ్మతించని పక్షంలో అతడి ఆశ్రమానికి నిప్పు పెట్టి రండి," అని ఆదేశించాడు.

సైనికులు యజ్ఞకర్ముడి ఆశ్రమానికి పోయి, రాజు చెప్పమన్నది చెప్పారు. అందుకు యజ్ఞకర్ముడు ఏమాత్రం చలించక, "ఛీ, ఆ దురహంకారిని, నేను శరణుకోరడమా!" అన్నాడు.

దానితో సైనికులు ఆశ్రమానికి నిప్పు పెట్టి, తిరిగివచ్చి ఆ సంగతి రాజుకు చెప్పారు.

వారం రోజుల తర్వాత, ఏ విధంగానైనా యజ్ఞకర్ముడితో శరణనిపించుకోవాలన్న పట్టుదలతో, వీరసేనుడు గుర్రం మీద ఆశ్రమానికి వెళ్ళాడు. ఆ సమయంలో యజ్ఞకర్ముడు ఒక చెట్టుకింద కూర్చుని, ఆయనకు కనిపించాడు.

రాజు, మునిని సమీపించి, "నన్ను ఎదిరించడంవల్ల, నీకు నిలవనీడలేక చెట్టు నాశ్రయించవలసి వచ్చింది. ఇప్పటికైనా మించిపోయిందిలేదు. నన్ను శరణు కోరుకో. అహంకారాన్ని వదులు." అన్నాడు.

అందుకు యజ్ఞకర్ముడు, "రాజా, నాది అహంకారం కాదు; ఆత్మగౌరవం. నువ్వు పరమదురహంకారివి. నీ కుమారు



డికి విద్యాబోధనచేసిన గురువునన్న జ్ఞానం కూడా, నీకు లేదు,'' అన్నాడు.

దానితో వీరసేనుడు రెచ్చిపోయి, ''ఈ క్షణానే నీ ప్రాణాలు తీస్తాను!'' అంటూ విల్లు ఎక్కుపెట్టి బాణం వదిలాడు.

అయితే—ఆ మరుక్షణం యజ్ఞకర్ముడి కనుల నుంచి కాంతికిరణాలు వంటివి వచ్చి, వీరసేనుడి బాణాన్ని మధ్యలోనే బూడిద చేశాయి.

ఇది చూసి వీరసేనుడు గుర్రాన్ని వెనక్కుతిప్పి పరుగు తీయించాడు. ఆ తర్వాత ఆయనేనాడూ యజ్ఞకర్ముడి ఆశ్రమం వైపుకు పోలేదు.

కొన్ని నెలల తర్వాత వీరసేనుడు, విజయవర్ధనుడికి వైభవంగా పట్టాభిషేకం జరిపించాడు. ఆ మర్నాడే విజయవర్ధనుడు, గురువును దర్శించేందుకు రథం మీద బయలుదేరి వెళ్ళాడు.

అయితే, అతడికి ఒక చెట్టు కింద కళ్ళు మూసుకుని తపస్సు చేసుకుంటున్న యజ్ఞకర్ముడు కనిపించాడు. ఆశ్రమ ప్రాంతమంతా తగులబడి వున్నది.

విజయవర్ధనుడు, యజ్ఞకర్ముణ్ణి సమీపించి పాదాలకు నమస్కరించాడు. యజ్ఞకర్ముడు కళ్ళు తెరిచి, ''నాయనా! క్షేమమా?'' అని పలకరించాడు.

''గురువర్యా! పట్టాభిషిక్తుణ్ణయిన సంతోష సమయంలో, మీ ఆశీర్వాదం కోసం వచ్చాను. కాని, తగలబడిపోయిన ఆశ్రమం నన్ను కలతబరుస్తున్నది. ఇది





ప్రమాదవశాత్తూ సంభవించిందా, లేక మరేదైనా కారణమా?'' అని అడిగాడు విజయవర్ధనుడు.

అందుకు యజ్ఞకర్ముడు, ''నాయనా! ప్రమాదవశాత్తూ సంభవించింది కాదు. అహంకారంతో కళ్ళు మూసుకుపోయిన ఒక ఉన్మాది ఘాతుకచర్య. వాడు నా ప్రాణం కూడా తీయప్రయత్నించాడు,'' అన్నాడు.

ఇది విన్న విజయవర్ధనుడు ఆవేశంగా, ''ఆ ఉన్మాది ఎవడైనా ఉపేక్షించను. వాడికి శిరశ్ఛేదం చేస్తాను: ఇదే నా ప్రతిజ్ఞ. వాడెవడో సెలవివ్వండి!'' అని అడిగాడు.

శిష్యుడి ప్రతిజ్ఞ విని యజ్ఞకర్ముడు కలవరపడి, ''ఈ కిరాతకం చేసిన వాడెవడో తెలుసుకోకుండా ప్రతిజ్ఞ చేయడం సముచితం కాదు. వాడెవడో తెలిస్తే, నువ్వు ప్రతిజ్ఞను ఉపసంహరించుకునే ప్రమాదం వున్నది!'' అన్నాడు.

''గురువర్యా! నేను చేసిన ప్రతిజ్ఞ నెరవేర్చనని ఎలా భావిస్తున్నారు? నన్ను శంకించక, ఆ కిరాతకుడెవడో తెలియజేయండి,'' అని కోరాడు విజయవర్ధనుడు.

యజ్ఞకర్ముడు ఒక క్షణం ఆగి, ''అతను మరెవరో కాదు; నీ తండ్రి వీరసేనుడు!'' అన్నాడు.

అది విని విజయవర్ధనుడు నివ్వెరపోయి, ''మీకింత అపకారం చేసినవాడు, నా తండ్రా? అయినా నేను క్షమించను! మీపట్ల ఆయన కెందుకంత పగ?'' అని అడిగాడు.

యజ్ఞకర్ముడు, విజయవర్ధనుడికి మొదటి నుంచీ జరిగినదంతా వివరంగా చెప్పాడు.

అప్పుడు విజయవర్ధనుడు, ''గురువర్యా! నేనీక్షణానేపోయి, నా తండ్రిని తీసుకువచ్చి, మీ పాదాలదగ్గిర ఆయనకు శిరశ్ఛేదం చేస్తాను!'' అంటూ వెనుదిరిగాడు.

యజ్ఞకర్ముడు, శిష్యుణ్ణి ఆగమని, ''నాయనా! జ్ఞాపకం వున్నది కదా— ఒకనాడు గురుదక్షిణ కోరమని వత్తిడి

చేశావు. తగిన సమయంలో అడుగుతా నన్నాను. ఆ సమయం ఇదే!'' అన్నాడు.

''గురువర్యా! అడగండి!'' అన్నాడు విజయవర్ధనుడు చేతులు జోడించి.

''నీ తండ్రికి ప్రాణభిక్ష పెట్టు! అదే నేకోరే గురుదక్షిణ,'' అన్నాడు యజ్ఞకర్ముడు.

''గురుదేవా! మీ ఆజ్ఞను శిరసావహిస్తాను,'' అని విజయవర్ధనుడు, యజ్ఞకర్ముడి పాదాలు స్పృశించి, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, తనకెంతో కీడుచేసిన రాజు వీరసేనుణ్ణి, తన తపశ్శక్తితో బూడిద చేయగలిగి వుండీ, యజ్ఞకర్ముడు అతణ్ణి ఎందుకు విడిచిపుచ్చాడు. అపకీర్తి భయంవల్లనా? ఒకవేళ అది కారణం కాదనుకుంటే, కొత్తగా రాజ్యాభిషేకం చేసుకున్న విజయవర్ధనుడి ద్వారా, ఆ కార్యం సాధించవచ్చు. అయినా, యజ్ఞకర్ముడు అందుకూ అంగీకరించలేదు. ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''సర్వసంగ పరిత్యాగి అయి, రాగద్వేషాలకు అతీతంగా జీవించే యజ్ఞకర్ముడు లాంటి మునికి అపకీర్తి భయం కానీ, కీర్తికాంక్ష గానీ వుండగలవనుకోవడం పొరబాటు. అటువంటి మహాపురుషులు, తమకు కీడు చేసినవారిని గట్టిగా హెచ్చరించి క్షమిస్తారే తప్ప, వాళ్ళపై పగ సాధించేందుకు తాముగా గాని, పరోక్షంగా గాని పూనుకోరు. ఈ కారణాలవల్లనే యజ్ఞకర్ముడు, గురుదక్షిణ పేరుతో శిష్యుడైన విజయవర్ధనుణ్ణి, తండ్రికి హాని చేయకుండా వారించాడు. అందువల్ల యజ్ఞకర్ముడి ప్రవర్తనలో కీర్త్యపకీర్తుల ప్రసక్తికి ఏమాత్రం ఆస్కారం లేదు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: ఎస్. శివనాగేశ్వరరావు రచన]



# రాకుమారుడి రాజసం

విజయపురి రాజు వీరవర్మకు, తన పూర్వీకుల రాజసం పట్లా, తన వంశ ప్రతిష్ఠపట్లా చాలా గౌరవం వుండేది. ఒకనాడు ఆయన సభ చాలించిన తర్వాత, విదూషకుడితో పిచ్చాపాటీ మాట్లాడుతున్నాడు. ఇంతలో ఆయన కొడుకు రెండేళ్ళవాడు కుమారవర్మ, తడబడే అడుగులతో అక్కడికి వచ్చాడు.

వీరవర్మ, కొడుకును ఎత్తుకుని సింహాసనం మీద కూర్చోబెట్టి, "కుమారా! ఏదీ మన రాజసం ఎలా వుంటుందో, ఒకసారి విదూషకుడికి చూపించు," అన్నాడు.

కుమారవర్మ, తండ్రిమాటలు గ్రహించినవాడిలా, కాలుమీద కాలు వేసుకుని కూర్చున్నాడు.

వీరవర్మ అది చూసి పొంగిపోతూ, "చూశావా! నా కుమారుడు రాజఠీవిని ఎలా ప్రదర్శిస్తున్నాడో?" అన్నాడు విదూషకుడితో.

దానికి విదూషకుడు, "అవును, మహారాజా! రాకుమారుడి వయసేమిటి? ఆ కూర్చున్న తీరేమిటి? ఆహాఁ!" అంటూ చిన్నగా నవ్వాడు.

ఈ మాటకు సంతోషించి వీరవర్మ, విదూషకుడికి ఒక హారాన్ని బహూకరించాడు.

తర్వాత కుమారవర్మ సింహాసనం దిగి ఆడుకోసాగాడు. అప్పుడు విదూషకుడు, "యువ రాజా! ఏదీ మరొకసారి మీ రాజసాన్ని ప్రదర్శించండి!" అన్నాడు.

కాని, కుమారవర్మ, విదూషకుడి మాట పట్టించుకోకుండా తన ఆటలో నిమగ్నమై పోయాడు. ఇది చూసి రాజు ముఖం చిట్లించాడు.

అయితే విదూషకుడు నవ్వి, "మహారాజా! యువరాజు మీకు తగినవాడని, మరొకసారి నిరూపించుకున్నాడు. 'తండ్రి ఆజ్ఞను తప్ప మరొకరి ఆజ్ఞను పాటించకుండా, తమ వంశ ప్రతిష్ఠను నిలబెట్టాడు!" అన్నాడు.

విదూషకుడి చమత్కారానికి మెచ్చుకుని, వీరవర్మ మరొక విలువైన హారాన్ని అతడికి బహూకరించాడు.

—వక్కలంక 'కిషోర్'



## చందమామ అనుబంధం-32

### మహనీయులు కలలుగన్న భారతదేశం:

# విభజన పరిష్కారం కాదు!

భారతదేశ చరిత్రలో ముఖ్యమైన 1940-46 మధ్య కాలఘట్టంలో భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్షపదవిని వహించిన స్వాతంత్ర్య సమరయోధుడు మౌలానా అబుల్‌కలామ్ ఆజాద్. అశేషప్రజల ఆదరాభిమానాలకు పాత్రుడయిన మౌలానా 1888 వ సం॥లో జన్మించాడు. దేశం స్వాతంత్ర్యం పొందాక ఆయన 1958 వ సం॥లో మరణించే వరకు, కేంద్ర విద్యామంత్రి పదవిని సమర్థవంతంగా నిర్వహించాడు.

మౌలానా భారతదేశ విభజనను వ్యతిరేకించాడు. సువిశాల భారతదేశాన్ని రెండు దేశాలుగా విడదీయడంవల్ల ఏర్పడగల దారుణ పర్యవసానాలను గురించి ఆయన 1946 వ సం॥లో ఇలా రాశాడు: "మన సమస్యలకు విభజన పరిష్కారం కాదు. విడదీయడంవల్ల స్పర్థలు పెరిగి, పరస్పరద్వేషాల కారణంగా ఉభయదేశాలలోని అల్పసంఖ్యాకులు అగచాట్లకు లోనుకావలసి వస్తుంది. ఈనాడు మన మధ్య ఏర్పడిన స్పర్థలు, ద్వేషాలు మన దేశ చరిత్రలో తాత్కాలికమైనవనే నేను భావిస్తున్నాను. గ్లాడ్‌స్టన్ అన్నట్టు నీళ్ళ భయం నుంచి బయటపడడానికి నీళ్ళలోకి దిగి ఈదడమే ఉత్తమమార్గం. అదే విధంగా మన సమస్యలను పరిష్కరించుకునే బాధ్యతను స్వయంగా మనమే వహించాలి. అదే సరైన మార్గం!" మౌలానా సలహాను పాటించి ఉన్నట్టయితే, ఈనాడు మన ఉపఖండంలో మరింత శాంతి ఉండేది!

## మీకు తెలుసా?

1. ప్రముఖ చరిత్రకారుడు లేన్‌పూల్, "ఆయన జీవితంలోకి దార్లిపడి అలాగే దార్లిపోయాడు!" అని వర్ణించిన సుప్రసిద్ధ వ్యక్తి ఎవరు?
2. ప్రపంచంలోకెల్లా చాలా లోతైన గనులు ఎక్కడ ఉన్నాయి?
3. పారసీకులు ప్రప్రథమంగా భారతదేశానికి ఎప్పుడు ఏ ప్రాంతానికి వచ్చారు?
4. భారతదేశంలో అతి పెద్దదైన నిర్మల జలతటాకం ఏది? (36 వ పేజీ చూడండి)

మన దేవుళ్ళు:



# సరస్వతి

పవిత్ర సరస్వతీనదీతీరంలో ప్రాచీన కాలంలో ఋషులెందరో నివసించారు. అక్కడ వారి నోటివెంట అద్భుతమైన శ్లోకాలు ఆవిర్భవించాయి. శీతల జలాలతో పావన నదీరూపంలో ప్రవహిస్తూ, జ్ఞానవాహిని అయిన సరస్వతి అవ్యాజ కరుణతో తమకు అద్భుతమైన ఊహా శక్తినీ, ఆధ్యాత్మిక ప్రేరణనూ, కలిగించిందని ఋషులు భావించారు!

సంపదలకు సాగరపుత్రి లక్ష్మి, శక్తికి పర్వత రాజకుమారి పార్వతి అధిదేవత లయినట్లే, విద్యకు అధిదేవత సరస్వతీ దేవి! పండితుల నాలుకలపై కొలువుండే వాగ్దేవి సరస్వతి, పరబ్రహ్మ నోటి నుంచి ఆవిర్భవించిందని చెబుతారు. హృదయాహ్లాదం, మానసికవికాసం ప్రసాదించే జ్ఞాన ప్రదాయిని అయిన శారదామాతను విద్యారంభ సమయంలో ప్రార్థించడం

మన సంప్రదాయం! స్వచ్ఛమైన తెలుపు రంగు దుస్తులనూ, ముత్యాల హారాలనూ, ఆభరణాలనూ ధరించే సత్య స్వరూపిణి సరస్వతి అని పురాణాలు పేర్కొంటాయి. వీణా పుస్తక ధారిణి అయిన వాణి వాహనం హంస!

### ఎన్నెన్ని యుద్ధాలు!

ఆఖరికి గల్ఫ్‌యుద్ధం ముగిసి ప్రపంచ ప్రజలకు ఎంతో ఉపశమనం కలిగించింది. ఈ సందర్భంగా నార్వేకు చెందిన ఒక గణితశాస్త్రజ్ఞుడు యుద్ధాలకు సంబంధించిన కొన్ని వివరాలు సేకరించాడు. గత 5,560 సంవత్సరాల కాలంలో జరిగిన యుద్ధాలలో గల్ఫ్‌యుద్ధం 14,531 వది. ఆ లెక్కల ప్రకారం యేడాదికి సగటున 2.5 యుద్ధాలు జరిగినట్టు తెలుస్తున్నది।




## చందమామ కబుర్లు




### అమెరికా నుంచి రామాయణ తొలి అనువాదం!

అమెరికాలో ప్రప్రథమంగా వాల్మీకి రామాయణాన్ని ఆంగ్లంలోకి అనువదిస్తున్నారు. మూడు విశ్వవిద్యాలయాలకు చెందిన ఐదుగురు సంస్కృత పండితులు ఈ పథకాన్ని పన్నెండేళ్ళ క్రితం చేపట్టారు. ప్రిన్స్‌టన్ విశ్వవిద్యాలయం ఇటీవల మూడవ సంకలనాన్ని విడుదల చేసింది. మరొక నాలుగు సంకలనాలు వస్తే రామాయణం పూర్తవుతుంది. పాతికేళ్ళ క్రితం బరోడా నుంచి వెలువడిన పరిష్కృత రామాయణ కావ్యం ఆధారంగా ఈ అనువాదం చేస్తున్నారు।

# సాహిత్యావలోకనం

1. రాబిన్‌సన్ క్రూసో, ద్వీపంలో ఎన్నాళ్ళు గడిపాడు ?

2. 'ఫుల్ సర్కిల్' అన్న పేరుతో స్వీయచరిత్రను రచించిన వారెవరు ?

3. 'ది పాస్ట్ మాస్టర్స్', 'ఏ పియమ్ ఆన్ పియం' అన్న రెండు పుస్తకాలను ఇద్దరు బ్రిటిష్ ప్రధానులు రాశారు. వాళ్ళెవరు ?

4. 'ఆల్ ఈజ్ వెల్ దట్ ఎండ్స్‌వెల్' అన్నది షేక్స్‌పియర్ నాటకాలలో ఒకటి. సుప్రసిద్ధ రష్యన్ రచయిత తన నవలకు మొదట ఆ పేరే పెట్టాడు. ఆ నవల ఏది ? రచయిత ఎవరు ?

## సమాధానాలు

మీకు తెలుసా ?

1. హుమయూన్: శిశువుగా వున్నప్పుడు తీవ్రంగా జబ్బు చేసి గండం నుంచి బయటపడ్డాడు. చివరి దశలో మెట్లపై నుంచి జారిపడి మరణించాడు.

2. బెంగళూరుకు సమీపంలో ఉన్న కోలార్ బంగారు గనులు.

3. క్రీ. శ. 760 వ సంIIలో. గుజరాత్‌కు.

4. కాశ్మీర్ లోయలోని వులార్ తటాకం.

సాహిత్యం

1. 28 సంవత్సరాలా, 2 నెలలా 19 రోజులు.

2. సర్ ఎంథోని ఈడెన్.

3. హెరాల్డ్ మాక్మిలన్; హెరాల్డ్ విల్సన్.

4. 'వార్ అండ్ పీస్' ; లియో టాల్‌స్టాయ్.



ప్రపంచ పురాణగాథలు - 6

## ఫలించిన హెచ్చరిక!

అందాల యువరాణి అట్లాంటా ఒకనాడు ఒంటరిగా కొండల మధ్య తిరుగుతూ వుండగా, ఆమెకొక విచిత్ర కంఠస్వరం వినిపించింది. అట్లాంటా వివాహం చేసుకోరాదనీ, చేసుకుంటే కీడు వాటిల్లుతుందనీ ఆ కంఠస్వరం హెచ్చరించింది!

ఆ సమయంలో, అట్లాంటాను వివాహమాడడానికి పలువురు రాకుమారులు, తమ అభిలాషను వ్యక్తం చేస్తూ, ఆమె తండ్రికి వర్తమానాలు పంపసాగారు. ఆమెను ఎవరికిచ్చి పెళ్ళి చేయడమా అని రాజు తీవ్రంగా ఆలోచించసాగాడు.





పెళ్ళి చేసుకోనంటే తండ్రి అంగీకరించడు. నిర్బంధించి వివాహం చేయించవచ్చు. అందువల్ల, అట్లాంటా బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చి, తండ్రితో, "నన్ను పరుగు పందెంలో ఓడించిన యువకుణ్ణే వివాహమాడతాను," అన్నది. రాజు ఆ నిబంధనకు అంగీకరించాడు.



పరుగుపందానికి వచ్చి, అట్లాంటాను ఓడించలేకపోయిన యువకులకు మరణ శిక్ష విధిస్తామని చాటింపు వేయించారు. హిపొమేనెస్ అనే యువకుడు పందెంలో న్యాయనిర్ణేతగా వ్యవహరించాడు. పెద్దల సమక్షంలో పరుగుపందెం అరంభమయిన మరుక్షణమే. అట్లాంటా వాయు వేగంతో పరిగెత్తి అందరినీ ఓడించింది.

ఓడిపోయిన యువకులు మరణం పాలయ్యారు. ఆ తరవాత మరి కొందరు వచ్చారు. వాళ్ళకూ అదే గతి పట్టింది. అంతవరకు న్యాయనిర్ణేతగా వ్యవహరించిన హిపొమేనెస్‌కు, పరుగు పందెంలో పాల్గొని తన అదృష్టాన్ని పరీక్షించుకోవాలన్న కోరిక కలిగింది.





అట్లాంటాకు హిపొమేనెస్ అంటే చాలా అభిమానం. అందువల్ల అతణ్ణి పరుగు పందానికి ప్రోత్సహించడమూ, వారించడమూ అని తేల్చుకోలేక ఆమె సతమతమయింది. హిపొమేనెస్ ఏకాంత ప్రదేశానికి వెళ్ళి, వీనస్ దేవతను మనసారా ప్రార్థించాడు.

వీనస్ దేవత సంతసించి, అతని ఎదుట ప్రత్యక్షమై మూడు అపిల్ ఫలాలు ప్రసాదించి ఏం చేయాలో సూచించింది. హిపొమేనెస్ పరమానందంతో వీనస్ దేవతకు నమస్కరించాడు.





అట్లాంటా, హిపొమేనెస్ ఇరువురి మధ్య పరుగుపందెం ప్రారంభం అయింది. దానిని చూడడానికి అసంఖ్యాకంగా ప్రజలు హాజరయ్యారు. అట్లాంటా పరుగెత్తడం ప్రారంభించగానే, హిపొమేనెస్ ఒక అపిల్‌ను అమె ముందు విసిరాడు.

అందమైన ఆ ఫలం అట్లాంటా దృష్టిని అకర్షించింది. అమె వేగం కొంత తగ్గించి, ఆ పండును అందుకునేలోగా, హిపొమేనెస్ వేగంగా పరిగెత్తి అట్లాంటాను అధిగమించాడు. అతని ఉపాయం చూసి ప్రేక్షకులు హర్షధ్వానాలు చేశారు.





మళ్ళీ రెండుసార్లు హిపొమేనెస్ అదే విధంగా ఫలాలను విసిరాడు. అట్లాంటా వాటిని పట్టించుకోకుండా పరిగెత్తాలని ప్రయత్నించింది కాని, ఆ ఫలాల ఆకర్షణకు తట్టుకోలేక వేగం తగ్గించి, వాటిని అందుకున్నది. ఆ కారణంగా హిపొమేనెస్ నాలుగు అడుగులు ముందు వచ్చి, పరుగుపందెంలో గెలుపొందాడు.

అట్లాంటా, అదృశ్య కంఠస్వరం చేసిన హెచ్చరికను మరచిపోయి, హిపొమేనెస్‌ను పెళ్ళాడింది. ఇద్దరూ పరమానందం చెందారు. ఆ ఆనందంలో హిపొమేనెస్, వీనస్ ఆలయానికి వెళ్ళి కృతజ్ఞత తెలియజేయాలన్న విషయం కూడా మరిచిపోయాడు.





వాళ్ళ మతిమరుపుకు వీనస్ దేవత ఆగ్రహం చెందింది. సిబిలి అనే దేవత ద్వారా వాళ్ళను శపించింది. మరుక్షణమే వధూవరులు సింహాలుగా మారిపోయారు. అట్లాంటాకు వినిపించిన హెచ్చరిక అలా ఫలించింది. వివాహం, ఆమె రూపంలో వింత మార్పును తెచ్చింది!



# కృతఘ్నుడు



పూర్వం రోము దేశంలో యూనాన్ అనే రాజు ఉండేవాడు. ఆయన గొప్ప శక్తిమంతుడు. ఆయనకింద అనేక సామంత రాజులుండేవారు. అయితే ఆయనను ఏదో చర్మవ్యాధి పట్టుకుని పీడించసాగింది. దానికి మహామహా వైద్యులు కూడా చికిత్స చేయలేకపోయారు. రాజుగారు ఎన్నో గుళికలు మింగాడు, కషాయాలు తాగాడు, ఒంటికి లేపనాలు పూయించుకున్నాడు; కాని అన్నీ వృధా అయ్యాయి. ఇక నా వ్యాధిని ఎవరూ నయం చేయలేరు, అనుకున్నాడు రాజు.

ఇలా ఉండగా ఆ దేశానికి రయ్యాన్ అనే ఒక ముసలి వైద్యుడు వచ్చాడు. రయ్యాన్ అనేక రకాల వైద్యంలో నిపుణుడైన ఘనవైద్యుడు. రాజుగారిని పీడించే చర్మవ్యాధి గురించి వినగానే ఆయన రాజభవనానికి వెళ్ళి, రాజుగారి దర్శనం చేసుకుని, "మహారాజా, తమరు అనుమతించినట్టయితే తమరిని పీడించే వ్యాధిని నేను నివారణ చేస్తాను," అన్నాడు.

"నీవు నా వ్యాధి నివారణ చేసేటట్టయితే నిన్ను అపార ధనవంతుణ్ణి చేసి, నా అంతరంగికులలో ఒకణ్ణిగా ఉంచుకోనా?" అన్నాడు రాజు.

"మీ వ్యాధి తప్పక నయమవుతుంది. మీకు కొంచెమైనా బాధ కలగకుండా చికిత్స జరిగేలాగు చేస్తాను," అన్నాడు ముసలి వైద్యుడు.

తరవాత వైద్యుడు ఒక ఇల్లు తీసుకుని ఒక ఔషధం తయారుచేశాడు. ఒక కొయ్య గూటం తీసుకుని దానిలో ఒక బొక్క పెట్టి అందులో ఔషధం వేసి, రంధ్రంలో ఒక పొడుగుపాటి పట్టుకర్ర అమర్చాడు. అది ఒక కొయ్య సమ్మెటలాగా తయారయింది. వైద్యుడు దానిని తీసుకుపోయి రాజుగారి

రోమను జానపద కథ




కిచ్చి, "మహారాజా, మీరీనాడు ఈ సమ్మెటతో 'పోలో' ఆట ఆడండి. మీ అరిచేతులకు చెమట పట్టినదాకా ఆడారంటే మీ వ్యాధి పూర్తిగా నయమవుతుంది!" అన్నాడు.

"పోలో" ఆట ఆడేవాళ్ళు గుర్రాలపై ఎక్కి నేల మీద ఉన్న బంతిని కొయ్య సమ్మెటలతో కొడుతూ ఆడతారు. రాజుగారు తన సిబ్బందితోసహా గుర్రాలపైన బయలుదేరి వైద్యుడిచ్చిన సమ్మెటతో, అరిచేతులకు బాగా చెమట పట్టినదాకా ఆడాడు.

తరవాత వైద్యుడు రాజుగారిని స్నానశాలకు తీసుకుపోయి, చక్కగా స్నానం చేయించి, పడుకోబెట్టి నిద్రపుచ్చి, తాను తన ఇంటికి వెళ్ళిపోయాడు.

నిద్ర లేచి చూసుకునేసరికి రాజుగారి చర్మవ్యాధి జాడ కూడా కనిపించలేదు. ఆయన ఆనందానికీ, ఆశ్చర్యానికీ మేర లేదు.

మర్నాడు వైద్యుడు సభకు రాగానే రాజు ఆయనను కౌగలించుకుని, అంతులేని కానుకలు సమర్పించాడు.

అది మొదలు రాజుగారికి వైద్యుణ్ణి ప్రశంసించటం తప్ప మరొక పని లేదు. "ఇలాటి వైద్యుడు ప్రపంచంలో మరొకడుంటాడా? ఇతను నాకు ఒక్క మందివ్వలేదు, ఒక్క పూత పుయ్యలేదు. కొయ్య గూటంలో ఉంచిన మందును నా శరీరంలోకి పంపించి ఏ వైద్యుడూ చేయలేకపోయిన చికిత్స చేశాడు!" అని రాజు వైద్యుణ్ణి మెచ్చుకోసాగాడు. రోజూ సభలో వైద్యుడే ప్రధాన విషయం. రోజూ ఆ వైద్యుడికి రాజుగారు ఏవో కానుకలు ఇస్తూనే ఉండేవాడు.

ఇదంతా చూసి మంత్రికి మండిపోయింది. రాజుకూ వైద్యుడికీ మధ్య విభేదం కల్పించాలనే ఉద్దేశంతో అతను రాజుగారిని ఒకనాడు ఒంటరిగా కలుసుకుని, "మహారాజా, మీకు నచ్చకపోయినా హితం చెప్పటం మా ధర్మంగదా. తమరు

ఈ ముసలి వైద్యుణ్ణి చేరదీసి ప్రమాదం తెచ్చుకుంటున్నారు,'' అన్నాడు.

''నీకేమైనా మతిపోయిందా ఏమిటి ? రయ్యాన్‌లాటి వైద్యుడు ప్రపంచంలో మరొకడు లేడు. ఎంతటి మేటివైద్యులూ కుదర్చలేకపోయిన నా చర్మవ్యాధిని ఆయన ఎంత సులువుగా, గారడీ చేసినట్టుగా, నయం చేశాడో నీవు చూడలేదా ? అటువంటి వైద్యుడికి ఆశ్రయమివ్వటంలో అపాయమేమున్నది ?'' అన్నాడు రాజు ఆశ్చర్యంగా.

"మహారాజుగారు దూరం అలోచించటం లేదు. ఈ రయ్యాన్ అలాటి శక్తి కలవాడు కావటమే ప్రమాదం. అంత వైద్యం చేతిలో ఉన్నవాడు మీ చేతికి మరొకటి ఏదో ఇచ్చి నిమిషాల మీద మీ ప్రాణం హరించగలడు!'' అన్నాడు మంత్రి.

''ఒక విధంగా అదీ నిజమే. ఇంతకూ నీ సలహా ఏమిటి ?'' అని రాజు మంత్రిని అడిగాడు.

''నాసలహా వైద్యుడి తల తీయించడమే! ఆయనకు వ్యవధి ఇవ్వటం అపాయం. అందుచేత ఆయనను పిలిపించి, వచ్చిన వెంటనే తల కొట్టించెయ్యండి!'' అన్నాడు మంత్రి.

''నీ సలహా బాగున్నది!'' అంటూ రాజు వైద్యుడికోసం కబురు చేశాడు.




కొద్దిసేపటికల్లా వైద్యుడు వచ్చి రాజును, ''నన్ను రమ్మన్నారట ? ఏమి సెలవు ?'' అని అడిగాడు.

''నిన్ను తల తీయించటానికే పిలిపించాను,'' అన్నాడు రాజు.

వైద్యుడు నిర్ఘాంతపోయి, ''ఎందుకు ? నావల్ల తమకు ఏమి ద్రోహం జరిగింది ?'' అని అడిగాడు.

''నీవు నా ప్రాణం తీయటానికై వచ్చిన వేగులవాడివని తెలిసింది. ముందు నేనే దెబ్బ తీస్తున్నాను! చావటానికి సిద్ధపడు!" అంటూ రాజు తలారివాణ్ణి కేక వేశాడు.

''మహారాజా, మీకు ఎవరో విషం పోశారు. కానివ్వండి, దైవనిర్ణయం ప్రకారం

అందరూ చావవలసిందే. అయినా, నాకల్లా ఒక్కటే విచారం. నా బసలో ఒక అమూల్యమైన వైద్యగ్రంథం ఉన్నది. దానిని తమరు నా కానుకగా స్వీకరించండి. అందులో అనేక అపూర్వమైన రహస్యాలున్నాయి. నా తల తీసేసినాక కావాలంటే ఆ తలచేత మీరు మాట్లాడించవచ్చు. ఆ రహస్యం కూడా ఆ గ్రంథంలో ఉన్నది!'' అన్నాడు వైద్యుడు.

రాజుగారికి వెంటనే ఆ గ్రంథం చూడాలన్న కాంక్ష కలిగింది. ఆయన తన నౌకరును వైద్యుడి బసకు పంపించి, వైద్యుడి పుస్తకాలు తెప్పించాడు. వాటిలో ఒక పుస్తకాన్ని రాజుగారికి చూపి వైద్యుడు, ''మహారాజా, అదే నేను తమకు చెప్పిన గ్రంథం!'' అన్నాడు.

రాజుగారు ఆత్రంగా ఆ పుస్తకం పుటలు తిప్పబోయాడు. కాని అవి ఒకదానికొకటి అంటుకుపోయి ఉండటంచేత రాజుగారు తన వేళ్ళను నాలుకకు అద్దుకుని పుటలు వేరు చేయవలిసి వచ్చింది. కొన్ని పుటలు తిప్పి రాజుగారు, ఇందులో ఏమీ లేదు. ''ఈ పుటలన్నీ ఖాళీగానే ఉన్నాయే?'' అన్నాడు.

''ఇంకా తిప్పండి. మూడు పంక్తులు ఎడమచేతి పుటలో రాసి ఉంటాయి,'' అన్నాడు వైద్యుడు.

మరి మూడు నాలుగు కాగితాలు తిప్పి రాజుగారు విరుచుకు పడిపోయాడు. అందరూ హాహాకారాలుచేసి ఆయనను పరీక్షించే లోపుగా ఆయన ప్రాణాలు పోనే పోయాయి. ఎందుచేతనంటే రాజుగారు తిప్పిన కాగితాలకు అతి ఘాటైన విషం అదివరకే పూసి ఉన్నది. రాజుగారు తన వేళ్ళను నాలుకకు అద్దుకున్నప్పుడల్లా కొంచెం కొంచెంగా ఆ విషం ఆయన శరీరంలో ప్రవేశించింది!

ఈ విధంగా అసూయాపరుడైన మంత్రి చెప్పుడుమాటలు విని కృతఘ్నుడై తనకు మేలు చేసిన వైద్యుణ్ణి చంపయత్నించిన యూనాన్‌రాజు తన ప్రాణాలను తానే తీసుకున్నాడు.






రావణుడి మాటలు విన్న సీత భయంతో వణుకుతూ, ఏడుపు గొంతుతో, ఒక గడ్డి పోచను చేత బట్టుకుని, దానితో ఇలా అన్నది:

"నువ్వు నన్ను గురించి ఆలోచించకు. పాపికి ఉత్తమలోకం ఎంత అసాధ్యమో, నేను నీకు అంత అసాధ్యమైన దాన్ని. నేను గొప్పకులంలో పుట్టిన పుణ్యాత్మురాలిని. తప్పుడు పనులు చేసే దాన్ని కాను. పతివ్రతను. నేను పరపురుషుడి భార్యను. నీ భార్యలు ఎలా ఉండాలని కోరుకుంటావో ఇతరుల భార్యలూ అలాగే ఉండాలనుకో. నీకు బుద్ధి చెప్పేవారు లేక ఇలాటి బుద్ధులు అవలంబించావు. లేదా, వినాశకాలం వచ్చి, వాళ్ళ మాటలు నువ్వు వినటం లేదో! నీ మూలాన ఈ లంక త్వరలో నాశనం అవుతుంది. అప్పుడు ప్రజలందరూ సంతోషిస్తారు. నాకు నీ అంతఃపురమూ, అధికారాలూ, సంపదా అవసరం లేదు. నేను రాముడికి మాత్రమే తగిన భార్యను. క్షేమంగా ఉండగోరితే ఆ రాముడితో మైత్రి చేసుకో. అతను ఉదారుడు గనక నీ తప్పు క్షమించి వదిలిపెడతాడు. నేను కూడా నీ పక్షాన మాట్లాడతాను. చిత్తశుద్ధితో నన్ను రాముడికి తిరిగి ఇచ్చెయ్యి. జనస్థానంలో రాముడు నీ వాళ్ళనందరినీ చంపటం చూసి, దొంగతనంగా నన్ను తీసుకు వచ్చిన పిరికివాడివి. అధముడివి! నిన్ను రామలక్ష్మణులు అవలీలగా చంపగలరు."

13. త్రిజటకలలు



కళ్ళతో సీత పట్ల సానుభూతి చూపారు. రావణుడు అక్కడ వున్న భయంకరాకారాలు గల రాక్షసస్త్రీలతో, "ఈ సీత మనసు నా మీదకు మళ్ళేటట్టు చెయ్యండి. సామదాన భేద దండోపాయాలన్నీ ప్రయోగించి చూడండి," అన్నాడు.

అప్పుడు రావణుడి భార్య లందరిలోకీ చిన్నదైన ధాన్యమాలిని అనే రాక్షసస్త్రీ రావణుణ్ణి కౌగలించుకుని, "నీకు నేనున్నాను గదా? రాక్షసరాజువైన నీకు ఈ మనుష్యస్త్రీ దేనికి? నీకు భార్య అయే గీత ఈవిడకు బ్రహ్మదేవుడు రాసి పెట్ట లేదు. అందుకే నిన్ను నిరాకరిస్తున్నది. ఇష్టం లేని మనిషిని కోరి ఏం ప్రయోజనం? నీ కోసం పడిచచ్చేదాన్ని నేనున్నాను గద!" అన్నది.

రావణుడు ధాన్యమాలిని మాటలకు నవ్వుతూ ఆమెను విడిపించుకుని, వెనక్కు తిరిగి, తన ఇంటికి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళగానే రాక్షస స్త్రీలు సీత చుట్టూ చేరి, ఆమెను నిందించారు. వారిలో ఏకజటా, హరిజటా, ప్రఘసా, వికటా, దుర్ముఖీ అనే వాళ్ళున్నారు. రావణుడు ఎంత గొప్పవాడో, అతనికి భార్య కావటం ఎంత గొప్ప విషయమో, సీత అతన్ని నిరాకరించటం ఎంత బుద్ధి తక్కువో వివరించి చెప్పారు.

ఈ మాటలకు రావణుడికి చాలా కోపం వచ్చింది. అతను సీతతో ఇలా అన్నాడు :

"సీతా, నువ్వు అన్న ప్రతి మాటకూ నేను నిన్ను చంపవచ్చు. కాని నీ మీద గల ఆశ నా కోపాన్ని అణచిపెట్టుతున్నది. నేను నీ కిచ్చిన గడువులో ఇంకా రెండు మాసాలు మిగిలి ఉన్నాయి. ఆ తరవాత నువ్వు నా భార్య వవుతావు. అందుకు ఒప్పుకోకపోతే నిన్ను చంపి, వండించుకుని తినేస్తాను."

రావణుడు ఇలా క్రూరంగా సీతతో మాట్లాడి నందుకు అతని వెంట ఉన్న రాక్షసస్త్రీలు కొందరు నొచ్చుకుని, తమ

సీత వాళ్ళతో, "ఇలా మాట్లాడటం పాపమని మీకు తెలీదా? మీరందరూ కలిసి నన్ను పీక్కుతిన్నా నాకు సమ్మతమేగాని, నేను రావణుడికి భార్యను మాత్రం కాను," అన్నది.

అప్పుడు రాక్షసస్త్రీలు సీతను భయపెట్టసాగారు. వాళ్ళు అనే మాటలన్నీ చెట్టు మీద ఉన్న హనుమంతుడు వింటూనే ఉన్నాడు. సీత రాక్షసస్త్రీలతో సహా వచ్చి, హనుమంతుడు ఎక్కి ఉన్న శింశుపావృక్షం కిందనే కూర్చున్నది.

అప్పుడు వినత అనే రాక్షసి సీతతో, "నువ్వు చాలా గుణవంతురాలివి. పతివ్రతవు. అది ఎంతో మెచ్చుకోదగిన సంగతి. కాని దేనికైనా ఒక మితి ఉండాలి. రావణుడు అందగాడూ, పరాక్రమవంతుడూ, రాక్షసులకు రాజూనూ. అతనికి భార్యవై చక్కగా అలంకరించుకో, సుఖపడు. రాముడు దుఃఖజీవి. రావణుడితో శత్రుత్వం పెట్టుకుని బతకలేడు. అతని మీద ఆశ వదులుకో," అన్నది.

"మేమంతా నీ మేలుకోరే చెబుతున్నాం. మా మాటలు ఎందుకు వినవు? నీ యౌవనం శాశ్వతమనుకుంటున్నావా? నిన్ను చంపేసి తినేస్తాం!" అన్నారు రాక్షసస్త్రీలు.



"ముందు సీతను చంపి తరవాత, రావణుడితో సీత చచ్చిందని చెబుదాం. రావణుడు, అలా అయితే తినెయ్యండి, అంటాడు. ఈవిడ మాంసాన్ని అందరికీ సమానంగా పంచండి. లేకపోతే తరవాత కీచులాడుకోవలసివస్తుంది," అని రాక్షసస్త్రీలు తమలో తాము మాట్లాడుకున్నారు.

వాళ్ళ మాటలు వింటూ సీత అమితంగా దుఃఖించింది; రామలక్ష్మణులనూ, కౌసల్యా, సుమిత్రలనూ తలచుకుని ఏడ్చింది; తనకు చావు రానందుకు విచారించింది.

అంతవరకూ పడుకుని ఉండిన త్రిజట అనే ముసలి రాక్షసి మిగిలిన రాక్షస



స్త్రీలతో, "మీరంతా ఆ సీతను ఏం తింటారు? నన్ను తినండి. నాకు ఒక భయంకరమైన కల వచ్చింది. రాక్షసులకు నాశమూ, రాముడికి జయమూ కలుగుతాయట," అన్నది.

"ఏమిటా కల?" అని రాక్షసస్త్రీలు త్రిజటను అడిగారు.

తూర్పు తెల్లవారుతూండగా త్రిజట తన కలను వాళ్ళకు ఈ విధంగా చెప్పింది: "రాముడు తెల్లని పూలదండలూ, తెల్లని బట్టలూ కట్టుకుని, లక్ష్మణుడితో సహా, ఆకాశమార్గాన ఒక పల్లకీ ఎక్కి లంకకు వచ్చాడు. దాన్ని వెయ్యి హంసలు తెచ్చాయి. ఈ సీత తెల్లని బట్టలు ధరించి, సముద్ర మధ్యంలో శ్వేతపర్వతం మీద నిలబడి ఉన్నది. ఆమె రాముణ్ణి చేరుకున్నది. తరవాత రాముడు లక్ష్మణుడితో సహా కొండంత ఏనుగు మీద ఎక్కి లంకలో తిరగటం చూశాను. తరవాత సీతా రామ లక్ష్మణులు ఏనుగు మీద లంకకు పైగా కనిపించారు. చివరకు రాముడు సీతను, లక్ష్మణుణ్ణి తీసుకుని పుష్పకవిమానంమీద ఉత్తరంగా వెళ్ళటం కనిపించింది. రావణుడు గన్నేరు పూల మాలలు ధరించి, ఒళ్ళంతా నూనె పూసుకుని, నూనె తాగుతూ కైపెక్కి, నేలమీద పడినట్టు చూశాను. ఇంకోసారి రావణుడు పుష్పకం నుంచి కిందపడ్డట్టూ, నెత్తి మీద వెంట్రుకలు లేనట్టూ, నల్లబట్టలు కట్టుకున్నట్టూ, ఎవరో ఆడది అతన్ని ఈడ్చుకు పోతున్నట్టూ చూశాను. రావణుడు గాడిదనెక్కి దక్షిణంగా పోవటం కూడా చూశాను. ఇంకోసారి అతను భయపడి, గాడిద మీది నుంచి తలకిందులుగా పడడం కనిపించింది. ఒక స్త్రీ ఎర్రనిబట్టలు కట్టుకుని, ఒళ్ళంతా బురద పూసుకుని, రావణుడి మెడకు తాడు కట్టి దక్షిణంగా ఈడ్చుకుపోయింది. కుంభకర్ణుడు కూడా ఇలాగే కనిపించాడు. రావణుడి కొడుకులందరూ నూనెతో అభిషేకాలు చేసుకున్నట్టు కనబడ్డారు.



రావణుడు పందినీ, ఇంద్రజిత్తు మొసలినీ, కుంభకర్ణుడు ఒంటెనూ ఎక్కి దక్షిణంగా పోవటం కనిపించింది. ఒక్క విభీషణుడు మాత్రం తెల్ల పూలమాలలూ, తెల్ల బట్టలూ, ఒంటికి తెల్ల గంధమూ ధరించి, తన నలుగురు మంత్రులతో సహా నాలుగు దంతాలు గల పెద్ద ఏనుగు మీద కూర్చుని కనిపించాడు. లంకానగరం విరిగి సముద్రంలో పడటం కనిపించింది."

ఇలా చాలాసేపు తనకు వచ్చిన కలలో విశేషాలు రాక్షసస్త్రీలకు చెప్పి, త్రిజట, "మీరు దూరంగా ఉండండి. రాముడికి సీత దొరికిందే అనుకోండి. సీతతో చెప్పేదేదో మంచిగానే చెప్పండి. మనం సీత నుంచి అభయం కోరటం మంచిదనుకుంటున్నాను," అన్నది.

చెట్టు మీది నుంచి అంతా చూస్తూ, అంతా వింటున్న హనుమంతుడికి సీతను ఎలా ఓదార్చాలో తెలియలేదు. ఆమెతో మాట్లాడకుండా తిరిగి వెళ్ళటం అర్థం లేని పని. రాక్షసస్త్రీలకు అనుమానం కలిగించి, రాక్షసవీరులతో యుద్ధం తెచ్చుకోవటం అవివేకం! యుద్ధంలో జయమే కలుగుతుందని చెప్పటానికి లేదు; ఒకవేళ తాను రాక్షసులను చంపినా, తిరిగి సముద్రాన్ని దాటేశక్తి మిగలకపోవచ్చు. సీత తనను మాయారూపంలో ఉన్న రాక్షసుడని భయపడకుండా చూడాలి.

అన్నివిధాలా ఆలోచించి, హనుమంతుడు ఇలా ఒక కథ, సీతకు వినిపించేలాగా, చెప్పాడు:

"దశరథుడు అనే గొప్ప రాజుకు రాముడు అనే పెద్ద కొడుకు ఉండేవాడు ఆ రాముడు తండ్రి ఆజ్ఞచేత భార్యనూ, తమ్ముణ్ణీ వెంట బెట్టుకుని అరణ్యానికి వెళ్ళాడు. అరణ్యంలో ఆ రాముడు శూరులైన రాక్షసులను అనేక మందిని చంపాడు. జనస్థానంలో అనేక మంది రాక్షసులు రాముడి చేతిలో చచ్చారని విని, రావణుడు మాయలేడి ద్వారా

మోసం చేసి, సీతను ఎత్తుకు పోయాడు. రాముడు తన భార్యకోసం అరణ్యాలలో వెతుకుతూ పోగా, సుగ్రీవుడు అనే వానరుడితో స్నేహం కుదిరింది. రాముడు వాలి అనే వానరరాజును చంపి, సుగ్రీవుడికి వానరరాజ్యం ఇప్పించాడు. సుగ్రీవుడు ఆజ్ఞాపించగా, అనేకవేల వానరులు సీతాదేవిని వెతకటానికి అన్ని దిక్కులకూ బయలుదేరారు. వారిలో ఒకడినైన నేను నూరు యోజనాల సముద్రాన్ని దాటి వచ్చాను. రాముడు వర్ణించినట్టుగానే ఉన్న సీతను చూశాను.''



ఇంతవరకు చెప్పి హనుమంతుడు ఆగాడు. అతని మాటలను పూర్తిగా విన్న సీత నిర్ఘాంతపోయి, తల ఎత్తి చెట్టులోకి చూసింది. ఎంతో శ్రమపడి అంతటా కలయ జూసిన మీదట ఆమెకు హనుమంతుడు కనిపించాడు.

తెల్లని బట్ట కట్టుకుని చెట్టు కొమ్మల మధ్య మెరుపులాగా కనిపించిన హనుమంతుణ్ణి చూడగానే సీతకు కాస్త భయం పుట్టింది. ఆపదలో కనిపించే కోతి రూపం తనకు కనిపించిందని ఆమె చాలా దుఃఖించింది. రాక్షసస్త్రీలు విని పోతారని ఆమె నిశ్శబ్దంగా ఏడ్చింది. లంకలో రాముడి కథ చెప్పేవాళ్ళుండటం అసంభవం కాబట్టి, తాను కలగంటున్నానని ఆమె అనుకున్నది. కలలో కోతి కనిపించటం చాలా చెడ్డది; రాముడికి ఏం ఆపదవస్తుందో అని భయపడింది. అయితే తనకు నిద్రే లేనప్పుడు కల ఎలా వస్తుంది? తాను అస్తమానమూ రాముణ్ణి గురించే ఆలోచించటంవల్ల తనకు రాముడి విషయం విన్నట్టు భ్రమ కలిగి ఉంటుందని ఆమె అనుకున్నది. ఏమైనా తాను విన్న మాటలు నిజం కావాలని ఇంద్రుడికీ, బృహస్పతికీ, బ్రహ్మకూ, అగ్నిహోత్రుడికీ మనసులోనే దణ్ణాలు పెట్టుకున్నది.

ఈలోపల హనుమంతుడు చెట్టు మీది నుంచి నేల మీదికి దూకి, సీతను సమీ

పించి, చేతులు జోడించి నమస్కారం చేసి, "అమ్మా, పతివ్రత లాగా కనిపిస్తున్నావు. నువ్వెవరు? ఎందుకు కంటనీరు కార్చుతున్నావు? నిన్ను చూస్తే ఏ దేవగణానికో చెందిన దానివి అనిపిస్తున్నది. నీ కొడుకూ, తండ్రీ, సోదరుడూ, భర్తా ఎవరు? ఒకవేళ నువ్వు రావణుడి చేత జనస్థానం నుంచి అపహరించి తేబడిన సీతవే అయితే ఆ సంగతి వెంటనే చెప్పు. నీకు అన్నివిధాలా శుభం కలుగుతుంది," అన్నాడు.

దానికి సీత హనుమంతుడితో ఇలా అన్నది:

"నేను దశరథమహారాజు కోడలిని. విదేహరాజైన జనకుడి కూతురిని. నా పేరు సీత. రాముడి ఇంట పన్నెండేళ్ళు సమస్త సుఖాలూ అనుభవించాను. పదమూడో ఏట రాముడికి పట్టాభిషేకప్రయత్నాలు జరుగుతూండగా, దశరథుడి భార్యలలో కైకేయి అనే ఆమె, రామ పట్టాభిషేకం జరిగితే తాను నీరూ, ఆహారమూ విసర్జించి చచ్చిపోతాననీ, రాముణ్ణి అరణ్యానికి పంపమనీ అన్నది. లోగడ కైకేయికి వరాలు వాగ్దానం చేసి ఉన్న దశరథుడు అసత్యానికి పాల్పడలేక, రాముడికి ఇస్తానన్న రాజ్యాన్ని తిరిగి రాముడి నుంచి తీసుకున్నాడు. రాముడు తండ్రి మాటకు మనస్ఫూర్తిగా సమ్మతించి, నారబట్టలు కట్టుకుని బయలుదేరుతూ, నన్ను కౌసల్య దగ్గిర ఉండమన్నాడు. రాముణ్ణి విడిచి స్వర్గంలో కూడా ఉండలేను. అందుచేత నేను అతనికన్న ముందే అరణ్యానికి బయలుదేరాను. అలాగే సుమిత్ర కొడుకైన లక్ష్మణుడు కూడా రాముడితో బాటు బయలుదేరాడు. మేం దండకారణ్యంలో ఉంటూండగా, దుర్మార్గుడైన రావణుడు నన్ను ఇక్కడికి తెచ్చాడు. రావణుడు నన్ను ఇంక రెండు మాసాలపాటు ప్రాణాలతో ఉండనిస్తానన్నాడు. తరవాత నేను చచ్చిపోతాను."

ఈ మాటలు విన్న హనుమంతుడు విచారంతో సీతను ఓదార్చాడు.





# రాకుమారి పంతం

చింతపల్లి చాలా చిన్న గ్రామం. ఆ గ్రామంలో చలపతి అనే యువకుడొకడుండే వాడు. తల్లిదండ్రులు హఠాత్తుగా చని పోవడంతో, వాడు మేనమామ పంచన చేరవలసి వచ్చింది. వాడి అత్త బ్రహ్మ దేవమ్మ పరమ గయ్యాళి. చలపతి ఇంటికి వచ్చిన రోజునే ఆమె పాలేరునూ, పని మనిషినీ పనుల్లోనుంచి తీసివేసింది. ఆ కారణంగా, చలపతి ఇంటెడు పనీ ఒక్కడే చేయవలసి రావడంతో, ఏడాది తిరగకుండానే వాడి ఎడమచెయ్యి చచ్చు బడిపోయింది.

ఒంటి చేతితోనే ఇంటిపనులన్నీ చేస్తున్నా, బ్రహ్మదేవమ్మకు చలపతి పట్ల ఏమాత్రం జాలీ కలిగేది కాదు. ఆమె చాలా స్థూలకాయురాలు కావడంతో ఆయాస పడుతూ, ఇంటివసారాలో వున్న ఉయ్యాల బల్లమీద కూర్చుని, వేరుసెనగకాయలు తింటూ, చలపతిని త్వరగా ఇల్లు ఊడవమనీ, బట్టలు ఉతకమనీ నానా తిట్లూ తిడుతూండేది. చలపతి క్రమంగా బ్రహ్మ దేవమ్మ అత్తను, బ్రహ్మరాక్షసిఅత్త అనుకోవడం ప్రారంభించాడు.

ఆ సంవత్సరం ఎడతెరిపి లేని వర్షాల వల్ల, వేరుసెనగపంటదెబ్బతినిపోవడంతో, వాటి ధర బాగా పెరిగిపోయింది. పట్టణంలో వేరుసెనగకాయలు కొంత చౌకగా అమ్ముతున్నారని విన్న బ్రహ్మ దేవమ్మ, చలపతితో, "ఒరే, సోమరి వెధవా! నువ్వు వెంటనే పట్నం వెళ్ళి, బాగా బేరంచేసి, ఒక వేరుసెనగకాయల బస్తా భుజానవేసుకురా. బాడుగ బండి అంటూ డబ్బు తగలేశావో, నీ వీపు చిట్ల గొడతాను," అన్నది.

చలపతి వుండే గ్రామానికీ, పట్టణానికీ మధ్య ఒక అడవి వున్నది. క్రూర మృగాల

మాచిరాజు కామేశ్వరరావు



భయంవల్ల, ఎవరూ ఆ అడవిమార్గాన ఒంటరిగా ప్రయాణం చెయ్యరు. చలపతి తప్పనిసరి కనక, ఒంటరిగా బయలుదేరి పట్టణంచేరి, అక్కడ వేరుసెనగకాయలు ఒక బస్తాకుసరి పోసుకొని, తిరుగు ప్రయాణం అయ్యాడు.

వాడు అడవిమార్గాన కొంతదూరం నడిచి, బస్తా బరువుకు బాగా అలిసిపోయి, ఒక చెట్టుకింద దానిని దించి, ఆయాస పడుతూ కూర్చున్నాడు.

నాలుగైదు నిముషాలకాలం గడిచే లోపల నల్లని దుస్తులతో, చింపిరితలతో, చేతిలో వంకరటింకరగా వున్న కర్ర ఒకటి పట్టుకుని, ఒక ముసలిది వాడి దగ్గిరకు వస్తూ, "ఎవడ్రావాడూ! నేను ఏనాడో విత్తనంవేసి మొలకెత్తించిన ఇంత పెద్ద దిరిసెన చెట్టుకింద, నే కూర్చునే చోట హాయిగా కూర్చున్నాడు? ఆఁ, ఎన్ని గుండెలు! ఎన్నిగుండెలు!" అన్నది కీచు గొంతుతో.

చలపతి ఆ వికృతాకారాన్ని చూసి ముందు భయపడి, అంతలోనే తెప్పరిల్లి గుండె దిటువు చేసుకుని, "నేనేఅత్తయ్యా, చలపతిని! నీకూ, మా బ్రహ్మదేవమ్మ అత్తయ్యకూ మధ్య ఎలాంటి పోలికలూ లేవు. ఆశ్చర్యం!" అన్నాడు.

ఆ జవాబుకు ముసలిది ఒక్క క్షణం నివ్వెరపోయి, "ఏమన్నావు, ఆశ్చర్యమా? నన్ను చూసినవాళ్ళెవరైనా భయంతో వణికిపోతారు. నువ్వు ఆశ్చర్యపడు తున్నావా? నీ ధైర్యానికి మెచ్చాను. నాకూ, నీ బ్రహ్మదేవమ్మ అత్తయ్యకూ మధ్య పోలికలు లేవన్నావు. సరే, ఇంతకూ నీవనే ఆ అత్త ఎలా వుంటుందేం?" అని అడిగింది.

ఆ ప్రశ్నకు చలపతి కాసేపు తల గోక్కుని, "మా అత్తయ్య, ఈ దిరిసెన చెట్టు బోదెలా వుంటుంది. నువ్వేమో ఎండికాలిన కట్టెపుల్లలా వున్నావు. నీ వేషం నిన్నూ చూస్తూంటే, ఎవరైనా మాంత్రికు రాలనుకోగలరు," అన్నాడు.

ఆ మాటలకు ముసలిది పెద్దగా నవ్వి, చేతిలోని కర్రను గాలిలో తిప్పుతూ, "ఒరే, మతిమాలిన వెధవా! ఎవరో అనుకోవడం కాదు, నేను నిజంగానే మాంత్రికురాల్ని. ఎన్ని మంత్రతంత్రాలు నేర్చినా శరీరానికి అప్పుడప్పుడూ, ఏదో ఒక వ్యాధి సోకక తప్పదు. అందువల్లే, ఈ మధ్య నేనిలా బక్కచిక్కిపోయాను. సరే, కానీ ఆ బస్తాలో వున్నదేమిటి?" అంటూ మాంత్రికురాలు కర్రతో వేరుసెనగకాయల బస్తా మీద పొడిచింది.



ఆ వెంటనే చలపతి బస్తాను రెండు చేతులతో పట్టుకుని, "ఇందులో వున్నవి వేరుసెనగ కాయలు. మా అత్తయ్య తినే ఫలహారం. ఆమె బలానికీ, శక్తికీ ఈ కాయలే మూలకారణం," అన్నాడు.

"అలా చెప్పవేం మరి! నాకీ మధ్య బొత్తిగా నడిచే ఓపిక కూడా లేకుండా పోతున్నది. ఆ కాయలేవో నాకిచ్చి, నీ దారిన పో," అన్నది మంత్రగత్తె.

"ఇంకా నయం, నా ప్రాణం ఇవ్వమని అడిగావు కాదు! ఇవి నీకిచ్చి ఇంటికి పోతే, మా అత్తయ్య నన్ను మరోలోకానికి ప్రయాణం కట్టిస్తుంది," అన్నాడు చలపతి.

అది విని మంత్రగత్తె కొంచెంసేపు ఆలోచించి, "బలం ఇచ్చే ఈ కాయలకు బదులుగా, నీకు పిల్లలుపెట్టే కోడిపెట్ట నిస్తాను. ప్రపంచంలో ఎక్కడా అలాంటి కోడిపెట్ట వుండదు," అన్నది.

"ఆ పెట్టను రాత్రికిరాత్రే, మా అత్తయ్య కాల్చుకు తినేస్తుంది," అన్నాడు చలపతి నవ్వుతూ.

"అయితే, దానితోపాటు పాలకు బదులు నీళ్ళు ఇచ్చే ఆవునొకదాన్ని ఇస్తాను. అటువంటి ఆవు కూడా ఎక్కడా వుండదు," అన్నది మంత్రగత్తె.

"పాలకు బదులు నీళ్ళిచ్చే ఆవును, ఇంటి ఆవరణలోకి రానిస్తుందా, మా బ్రహ్మరాకసి బ్రహ్మదేవమ్మ అత్తయ్య? ఇంకా నయం!" అన్నాడు చలపతి.



బస్తా మంత్రగత్తె కిచ్చాడు. మంత్రగత్తె, చలపతిని వెంటబెట్టుకుని అడవిలో చాలా దూరాన గల, తన ఇంటికి తీసుకుపోయి, వాడికి పిల్లల్ని పెట్టే కోడినీ, నీళ్ళిచ్చే ఆవునూ, మాట్లాడే కాకినీ ఇచ్చింది.

సూర్యోదయం అవుతూండగా చలపతి అక్కడి నుంచి బయలుదేరాడు. కాకి, వాడితో, "నేనెక్కడికైనా పారిపోతానని భయపడకు. నీ వెనక కొంచెం దూరంలో వస్తూంటాను. గట్టిగా చప్పట్లు చరిస్తే చాలు. వచ్చి నీ భుజం మీద వాలతాను," అని చెప్పింది.

వాడు అడవిలోని కాలిబాట వెంట నడుస్తూ, సాయంత్రానికల్లా ఒక ఊరు చేరాడు. అయితే, అనుకోకుండా వర్షం ప్రారంభం కావడంతో, వాడు దాపులనున్న ఒక సత్రంలో బసచేయవలసి వచ్చింది.

చలపతికన్న ముందుగా, ఆ సత్రంలో ఒక ఘనవైద్యుడు బసచేసి వున్నాడు. చలపతి తెచ్చిన కోడిపెట్ట సత్రం అరుగు మీద గుడ్డుకుబదులుగా, పిల్లను పెట్టడం చూసి వైద్యుడు అమితాశ్చర్యం చెంది, "ఏమిటీ అద్భుతం! కోడి యజమానివి నువ్వేనా?" అని చలపతిని అడిగాడు.

అవునన్నట్టు వాడు తల వూపగానే వైద్యుడు, "ఈ అద్భుతమైన కోడిపెట్టను అమ్ముతావా?" అని అడిగాడు.

"వీటితోపాటు మాట్లాడే కాకిని కూడా ఇస్తాను, సరా?" అని అడిగింది మంత్రగత్తె.

"మా అత్తయ్యముందు మనుషులే సరిగా మాట్లాడలేరు. కాకులూ, కుక్కలూ అసలు నోరు విప్పగలవా?" అన్నాడు చలపతి.

"ఇంతకుమించి నా దగ్గిర మరేమీ లేవు. నన్ను కూడా, మీ అత్తయ్యలా భావించి, ఆ బస్తా కాయలూ ఇచ్చిపో, పుణ్యముంటుంది," అంటూ మంత్రగత్తె కళ్ళనీళ్ళు పెట్టుకున్నది.

చలపతికి ముసలి మంత్రగత్తె మీద జాలికలిగింది. వాడు వేరుసెనగకాయల

"అద్భుతమైన వాటిని ఎవరూ అమ్మరు!" అన్నాడు చలపతి.

"ఆ మాటా నిజమే!" అంటూ వైద్యుడు ఒక్క క్షణం ఆగి, "నీచచ్చు పడిన ఎడంచేయి బాగుపడేలా, నేను వైద్యం చేస్తాను. ఈ రాత్రికి నా దగ్గిర వున్న ఒక అమోఘమైన లేపనం, నీ చేతికి మర్దనం చేశానంటే, తెల్లవారేసరికి అది మామూలు చేయిలా అయిపోతుంది. అప్పుడు కోడిని నాకిద్దువుగాని, సరేనా?" అన్నాడు.

చలపతి అందుకు ఒప్పుకున్నాడు. ఆ రాత్రి వైద్యుడు, చలపతి చేతికి ఏదో లేపనం రాశాడు. తెల్లవారేసరికి వాడి చెయ్యి మామూలుగా అయిపోయింది. చలపతి సంతోషంగా కోడిని వైద్యుడి కిచ్చి, ఆవును వెంటబెట్టుకుని సత్రం నుంచి బయలుదేరాడు.

ఆ మధ్యాహ్నానికి వాడు ఒక కొండ ప్రాంతాన్ని చేరాడు. ఎండ తీవ్రంగా వున్నది. చలపతి ఒక కొండదారి మలుపు తిరుగుతూండగా, దారి పక్కన వున్న పొదలచాటు నుంచి వాడికి మూలుగు వినిపించింది. వాడు అక్కడికి వెళ్ళి చూడగా, ఒక నడివయసువాడు కనిపించాడు. వాడి వంటిమీద అక్కడక్కడా గాయాలున్నవి.

"అయ్యా, గొంతెండిపోతున్నది. నీళ్ళేమైనా వుంటే ఇవ్వండి," అన్నాడు గాయపడ్డ మనిషి.





అ చుట్టుపక్కల ఎక్కడా నీరున్న జాడలేదు. ఏమిచేయడమా అని చలపతి ఆలోచిస్తున్నంతలో వాడికి చప్పున తన వెంట వున్న అవు గుర్తుకు వచ్చింది. వెంటనే వాడు ఒక పెద్ద అకును దోనెలా చేసి, అందులోకి అవు నీళ్ళను పిండి, గాయపడినవాడి కిచ్చాడు.

అ గాయపడి మూలుగుతున్న వాడు నీరుతాగి సేదదేరి, తనను గురించి చలపతికి చెప్పాడు. అతను చాలా ధనికుడు. ముఖ్యమైన పని మీద పొరుగూరు పోతూండగా, హఠాత్తుగా దొంగలు అతణ్ణి కొట్టి దగ్గరున్న డబ్బు దోచుకుని పారిపోయారు.

"మీరు సమయానికి ఇన్ని నీళ్ళిచ్చి, గొంతు ఎండి చచ్చిపోతున్న నన్ను రక్షించారు," అన్నాడు ధనికుడు ఎంతో కృతజ్ఞతగా.

"అయ్యా, మీరు బతికి బయటపడడం—అంతా ఈ ఆవుచలవ! ఈచుట్టుపక్కల ఎక్కడా నీరున్న జాడలేదు," అన్నాడు చలపతి.

ధనికుడు జరిగింది తెలుసుకుని నిర్ఘాంతపోతూ, "పాలకు బదులు నీళ్ళిచ్చే ఆవా? అద్భుతం!" అని, కొంచెంసేపు ఆవుకేసి పరీక్షగా చూసి, "నా ప్రాణదాత, ఈ ఆవన్నమాట! మీరు తప్పక, మా ఇంటికి రావాలి, నన్ను కాపాడిన, ఈ ఆవును నా ఇంటనే వుంచుకుని, నిత్యం పూజించుకుంటాను," అన్నాడు.

చలపతి, ధనికుడి వెంట అతడి గ్రామం వెళ్ళాడు. ఆయన ఆవును తీసుకుని దానికి బదులుగా చలపతికి ఒక సంచి నిండుగా బంగారుకాసు లిచ్చాడు. ఆ ధనంతో వాడు ఒక తెల్లగుర్రాన్ని కొని, విలువైన దుస్తులు ధరించి రాజధానీ నగరానికి బయలుదేరాడు.

నగరం చేరుతూండగా, వాడికొక కొండా, దాని మీద ఒక దేవాలయం కనిపించాయి. దైవదర్శనం చేసుకుందామని వాడు, కొండమీదికి బయలుదేరాడు.

అదే సమయంలో, ఆ దేశపు యువరాణి దైవపూజ ముగించుకుని తన చెలికత్తె లతో కొండ దిగి వస్తున్నది.

ఆమె, తెల్లగుర్రాన్నెక్కి రాజవీధితో దేవాలయం కేసి పోతున్న చలపతిని చూసి, "ఆహాఁ, ఎవరీ యువకుడు? ఇంత అందగాడు ఏ దేశపు రాజకుమారుడై వుంటాడు!" అనుకుంటూ ఒకక్షణం వాడి కేసి చూసింది.

చలపతి గుర్రాన్ని అపి, "నా కేసి గుడ్లప్పగించి అలా చూస్తున్నావు, ఎవరు నువ్వు?" అని అడిగాడు.

ఆ ప్రశ్న విని రాకుమారి నివ్వెర పోయింది. ఆమె వెంట వున్న చెలికత్తెలు నోరువిప్పలేదు.

చలపతి, తన వెనక కొంచెం దూరంలో ఎగురుతూ వస్తున్న కాకికేసి చప్పట్లు చరిచి పిలిచి, "ఒరే, సేవకా! ఎవరీ సుందరి? పలకరిస్తే పలకదేం!" అన్నాడు.

"ఆ అందచందాలూ, వెంట చెలికత్తెలూ—చూస్తూంటే తెలియడం లేదా? ఈ దేశపు రాకుమార్తె అయి వుంటుంది!" అన్నది కాకి.

కాకి చెప్పినట్టు, ఆమె ఆ దేశపు రాజకుమార్తె; పేరు త్రిలోకసుందరి.

త్రిలోకసుందరి కాకి మాట్లాడడం వింటూనే, "అద్భుతం! మహాద్భుతం! ఇన్నాళ్ళకు ఎవరూ చేయలేని మహాద్భుతాన్ని చేయగలిగిన యువకుడు కంట



బడ్డాడు!'' అంటూ చెలికత్తెలతో గబగబా కొండదిగి వెళ్ళిపోయింది.

ఈ జరిగిందేమిటో ఏమీ అర్థం కాని చలపతి, దేవాలయంలోకి వెళ్ళి, దైవ దర్శనం చేసుకుని బయటికి వచ్చేసరికి, అక్కడ రాజుగారి పరివారం వాడికోసం వేచివున్నది. వాళ్ళు రాజమర్యాదలతో చలపతిని, రాజుగారి భవనానికి తీసుకుపోయారు.

త్రిలోకసుందరికి అమె తండ్రి, గత రెండేళ్ళుగా తగిన వరుణ్ణి చూసి వివాహం చేసి, రాజ్యభారం అతడికి అప్పగించాలని చూస్తున్నాడు. అయితే రాకుమారి మాత్రం, ''నేను మామూలు వాణ్ణెవణ్ణీ పెళ్ళి చేసుకోను. ఏదైనా గొప్ప అద్భుతం చేసిన వాణ్ణి మాత్రమే పెళ్ళాడతాను!'' అని పంతం పట్టి కూర్చున్నది.

ఎంతోమంది రాకుమారులు వచ్చి, ఆమెకు తమకు చేతనైన అద్భుతాలు చేసి చూపించారు. అయితే రాకుమారిని ఎవరూ మెప్పించలేకపోయారు. రాజుగారికి తన ఒక్కగానొక్క కుమార్తె వివాహం పెద్ద గడ్డు సమస్య అయి కూర్చున్నది. ఇటువంటి పరిస్థితుల్లో, ఆకాశంలో ఎగురుతున్న ఒక కాకిని దగ్గరికి పిలిచి, దానిచేత మాట్లాడించిన చలపతి, ఆమెకు గొప్ప అద్భుతం చేసినవాడిలా కనిపించాడు!

పక్షం రోజులు తిరగకుండానే చలపతి, రాకుమారిని వివాహమాడి, ఆ దేశానికి రాజయ్యాడు.

కాకితో కబురు పంపగానే, బ్రహ్మదేవమ్మ అత్త సుడిగాలి వేగంతో చలపతి దగ్గిరకు వచ్చి, ''ఒరే, బాబూ! నిజంగా నేను పాపిష్ఠిదాన్ని. జిహ్వాచాపల్యం కొద్దీ, నిన్ను వేరుసెనగకాయలబస్తా మోసుకు రమ్మని కష్టపెట్టాను. నన్ను క్షమించు!'' అన్నది.

దానికి చలపతి పెద్దగా నవ్వి, ''పెద్దదానివి, అదేం మాట అత్తయ్యా! ఈ సుఖం, ఆ కష్టంవల్ల దొరికిందే గదా!'' అన్నాడు.






పూర్వం హస్తినాపురంలో శివదత్తుడనే బ్రాహ్మడుండేవాడు. ఆయన గొప్ప ధనికుడు. అయినా ఆయన జీవితానికి సుఖమన్నది ఎరగడు. ఎందుచేతనంటే ఆయన భార్య పరమ క్రూరాత్మురాలు, గయ్యాళి. అటువంటి భార్యతో వేగలేక చివరకు శివదత్తుడు ఇంటినుంచి పారిపోయి సన్యాసం పుచ్చుకొన్నాడు.

శివదత్తుడికి ముగ్గురు కుమారులుండేవారు. పెద్దవాడికి వివాహం అయి కోడలు ఇంటికి రాగానే అత్తగారు కోరంటికం పెట్టనారంభించింది. ఈ కష్టాలు కొంత కాలం భరించి పెద్దకోడలు పుట్టింటికి వెళ్ళిపోయింది. ఆమె వెనకనే ఆమె భర్త కూడా అత్తవారిల్లు చేరి ఇల్లరికం ఉండసాగాడు.

తరవాత రెండవవాడి భార్య కాపరానికి వచ్చింది. వాడి భార్యను కూడా గయ్యాళి అత్తగారు కాల్చుకు తినసాగింది. పరమ సాధ్వి అయిన రెండవ కోడలు, అత్తగారు పెట్టే కష్టాలు భరించలేకపోయింది. పుట్టింటికి వెళ్ళితే గౌరవంగా వుండదని, ఒకనాడు ఆమె ఉరిపోసుకు చనిపోయింది. భార్యపోగానే మనోవ్యాధితో రెండవ కుమారుడు మంచం పట్టి కొద్దికాలానికి మరణించాడు.

తన అన్నలిద్దరి గతి చూసిన మూడవ కొడుకు, వసుదత్తుడనేవాడు, తన తల్లికి ఎలాగైనా మంచి గుణపాఠం నేర్పదలుచుకొన్నాడు.

ఆవిడ ఇంత గయ్యాళి మనిషి అయినప్పటికీ, ఇంత మగవాళ్ళు ఉదారవంతులు కావటంచేత, ఆవిడ చేసే దౌర్జన్యం ఎవరికీ తెలియదు. పెద్దకోడలు గడుసుది కావటంచేత భర్తను వశపరుచుకుని పుట్టింటికి పారిపోయిందనీ, రెండవ

25–ఏళ్ళనాటి చందమామ కథ

కోడలు అఘాయిత్యంచేత ఆత్మహత్య చేసుకున్నదనీ పైవాళ్ళు అనుకున్నారు. తల్లి దుర్మార్గం నలుగురికీ తెలిసివచ్చేటట్టు చేయటానికి వసుదత్తుడు ఒక ఉపాయం ఆలోచించాడు.

వాడు ఒకరోజు పొరుగూరు వెళ్లి మనిషి ఎత్తు కొయ్యబొమ్మను చేయించాడు. అర్ధ రాత్రివేళ ఆ బొమ్మను బండిలో తెచ్చి తన ఇంటి పక్కనే మరొక ఇంట్లో వుంచి, ఆ ఇంటికి గడియవేసి, వాకిలిదగ్గిర దాసీ దాన్ని కాపలా వుంచి తల్లిదగ్గిరికి వచ్చి, "అమ్మా, నేను పెళ్లి చేసుకొనివచ్చాను. నా భార్య మన ఇంట వుంటే లేనిపోని పోట్లాటలు వస్తాయి. అందుచేత దానిని పక్కయింట్లో ఉంచాను. అది ఇక్కడికి రానూవద్దు, నువ్వు అక్కడికి పోనూ వద్దు!" అన్నాడు.

తల్లి సరేనన్నది. కానీ, పెద్ద కోడళ్లిద్దరి మీదా ఉన్న కసి మూడోదానిమీద తీర్చుకో లేకపోతిని అని బాధపడింది. ఒకనాడు కొడుకు ఇంట్లో లేకుండాచూసి, ఆమె రోకలిబండతో తల పగలగొట్టుకుని, పెడ బొబ్బలు పెట్టసాగింది. ఆ సమయానికి కొడుకు కూడా వచ్చాడు. ఏమయిందని అక్కడ చేరిన అందరూ అడిగారు.

"చూశారా? నా కోడలు అకారణంగా వచ్చి రోకలిబండతో నా తల పగలగొట్టి లోపలికిపోయి తలుపు వేసుకున్నది!" అని ఆ గయ్యాళిది అందరికీ చెప్పింది.

"ఎంతపని జరిగిందీ!" అనుకుంటూ అందరూ పొరుగింట్లోకి జొరబడి చూసే సరికి, ఏమున్నదీ? కొయ్యబొమ్మ!

"ఇదే నా భార్య! ఇదే మా అమ్మను రోకలితో తల పగలగొట్టి లోపలికి వచ్చి తలుపేసుకున్నది!" అని వసుదత్తుడు అందరికీ చెప్పాడు.

అందరూ గయ్యాళి దాన్ని హేళన చేశారు, బాగా తిట్టారు.

ఆ తరవాత కొన్నాళ్ళకు వసుదత్తుడు మంచి కన్యను చూసి పెళ్ళాడాడు. ఆ పిల్లను అత్తగారు ఎన్నడూ పల్లెత్తుమాట అన్న పాపాన పోలేదు.




నీటిఏనుగు పరుగు
నదీజలం అడుగున నీటిఏనుగు అతి వేగంగా పరిగెత్తగలదు. ఈ జంతువు పది నిమిషాలవరకు నీళ్ళలో మునిగి వుండగలదు!


అతిపెద్ద ఎగిరే జంతువు
ఎగిరే జంతువులన్నిటిలోకీ టెరోజార్ క్వెట్ జాల్ కోట్లస్ నార్త్‌రోపీ అనే రాక్షసబల్లే చాలా పెద్దది. దాదాపు 6 కోట్లా 50 లక్షల సంవత్సరాలకు పూర్వం జీవించిన ఈ జంతువుల అవశేషాలను 1974వ సం॥లో అమెరికాలోని టెక్సాస్‌లో కనుగొన్నారు. 86 కి.గ్రా. బరువుగల ఈ జంతువు ఒక్కొక్క రెక్క 50 అడుగుల పొడవు వుండేది!


విషపూరిత సస్తన జంతువు!
ఆస్ట్రేలియాలోని డక్‌బిల్ట్ ప్లాటిపస్ అనే ఒక్క సస్తన జంతువుకు మాత్రమే విషపూరితాలైన గ్రంధులున్నాయి!

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1991 ఆగస్టు నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



K. S. Vijayaker

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జూన్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/—లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:— చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

### ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: మమతపెంచే పుష్టి! రెండవ ఫోటో: మనసుమెచ్చే సృష్టి!

పంపినవారు: వి. నాగరాజు, రామనాథపూర్, హైదరాబాదు (ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/- నెలాఖరులోగా పంపబడుతుంది.


చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 36-00

చందా పంపవలసిన చిరునామా:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama *Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.*

# In a class of its own

## *Exclusive pencils for one and all,*




LION PREMIER®
HB PENCILS

Sleek, Elegant, meant for executives and others, who like style. A consistent dark tone for effortless writing - micronized lead for unbreakable points are what adds to its superiority.






LION PINKY®
PENCILS

Lion 'PINKY' Pencils Pretty Perfect, Ideal for children because of its pretty designs & colours. Strongly bonded lead for unbreakable points and super smooth writing add to its attraction.






LION Geematic®
DRAWING PENCILS

Lion Geematic Drawing Pencils.
A unit for all Professionals like artists, architects, designers & engineers. Give expertise an edge.
Available in 14 grades from H to 6H and B to 6B HB and F





**LION PENCILS LTD**
95, Parijat, Marine Drive
BOMBAY 400 002

National-356

CASIO




కాసియో వుంటే చాలు. కావలసిన సంగీతమంతా ఝుమ్మని వాయించుకోవచ్చు — దీని మెట్ల మీద చేయి వేస్తే చాలు, సంగీతం పలుకుతుంది. నీకు నచ్చిన పాటల బాణీ తెలుసుకో, వాయిస్తూపో - నీ ఫ్రెండ్సంతా ఆ దరువుకు గంతులేస్తూంటే నువ్వొక సంగీతం స్టారైపోతావు! ఇక మరి ఆలస్యమెందుకూ! కాసియో మెట్లలో కావలసినంత సంగీతం — సూపర్ హిట్ సంగీతం. అది వినిపించడం నీ చేతిలో పని!










**CITY MUSIC CO., PTE LTD.**
Singapore Tel 3377058, 3377545

**ONFLO MUSIC CO., LTD.**
Hong Kong Tel: 722 4195

**RAINBOW PHOTO FINISHERS PTE LTD.**
Nepal, Kathmandu Tel: 221724

**GENERAL ENTERPRISES COMPANY**
U.A.E., Dubai Tel: 224131/2/3

**MAHMOOD SALEH ABBAR CO.**
Saudi Arabia, Jeddah Tel: (02)6473995

**ARABIAN CAR MARKETING CO.,LTD.**
Oman Tel: 793741

**CASIO COMPUTER CO., LTD.**
Tokyo, Japan

